First Edition : 1976

"కాపువృత్తి మాని కలమును చేగాని
పంతులనెడి పేర బరగె నెవడు
ఆ మహానుభావు నప్పల నరసార్యు
సచ్చరిత్రు నాదు జనకు దలతు."

"ప్రగతిశీల సాహిత్యపు ప్రథమ పుష్ప
మర్పితము చేతు నా తండ్రి కతులభక్తి
తండ్రి సంస్మరణే కదా ధరణిలోన
మానసిక శాంతి కలిగించు మనుజునకును."

Price : Rs 3-00

Printed at Freedom Press, 138-A, T. H. Road, Mudras - 600021.

# PREFACE

This is a critical essay on the short poetical compositions (Khanda Kavyas) of Sri Gurazada Appa Rao, the prince among the progressive poets of Andhra. I have written this specially with a view to cater to the needs of University students who are progressive-minded as well as lovers of fine arts.

Among the pre-eminent poets in the World of Telugu letters, there are five who are dearest to me namely, Vemanna, Tikanna, Potanna, Suranna last but not least Appanna (Apparao).[1] It is Appa Rao's literary works that I am going to discuss presently. The extraordinary qualities of genius that these "*Annas*" possess have made me their ardent admirer.

## VEMANNA

Vemanna was a great advocate of progressivism. A poet of the masses that he was, Vemanna spoke to them in their everyday language. He asked them to eradicate all distinction of caste and creed and strongly condemned the superstitious

---

1 Names like, Appanna, Appla Raju, Applanarasiah, Appa Rao, etc., are commonly used in Vijayanagaram and Visakhapatnam districts. These names owe their origins to the deity at Simhachalam-Simhadri Appanna Swamy. "*Appa Rao*" is merely a stylish version of "*Appanna*".

beliefs and blind worship of idols. He advised the rich to be compassionate and make use of their riches to help the poor and the needy. He exhorted people to live pure and responsible lives always exercising their reason and judgment. In this way Vemanna rendered inestimable service to the cause of building a new and better society.

## TIKKANNA

Tikkanna's genius was many-faceted. Generations and generations of Andhras have derived immense pleasure from the beauty of his diction and intensity of feeling in his expressions as well as his statesmanship and political acumen.

## POTANNA

Unlike most other poets who dedicated their works (Kavyas) to kings in return for material comforts and gains, Potanna offered his great poem (Bhagavatam) to Lord Srihari and attained perfect peace of mind. Without making his poetry a means of livelihood he lived the life of a hard-working farmer valuing his self-respect and dignity more than anything else. He showed a remarkable felicity in describing the simple cow-herds and their villages and homes.

V

## SURANNA

Suranna's poetical genius was at great as that of Tikkanna's. His creative power expresses itself in an entirely original manner, particularly in the art of story-telling. Some of the features of modern novel can be seen in his Prabandhas. His power of imagination and creative strength are unrivalled. Andhramata is fortunate in having such a complete poet.

## APPANNA—(APPARAO)

Let us now consider Appanna. Appanna was supreme among the progressive Telugu poets possessing a remarkable worldly wisdom. His poetical works (Khanda Kavyas) are inspired by his Universal love of humanity and his progressive humanism.

A humanist interests himself with the sufferings of his fellowmen. On the otherhand a progressive humanist probes into their root causes, and, having found them, strives his utmost to remove them. This is the difference between a *passive humanist and an active and progressive humanist.* Besides being replete with humanism, Appa Rao's poetry professes compassionate and progressive humanism.

## APPANNA — VEMANNA

These two poets may be viewed as brothers, Vemana being the elder. There are similarities in their language and expression and in their love of humour and satire. They are alike in their ideas of social reform and in their belief in non-violence.

A number of progressive writers and scholars have written critical essays on the "Khanda Kavyas" of Gurazada. The most important among such critics are: Sarva Sri K. V. Ramana Reddy[2], Sri Sri, C. Narayana Reddy and D. Prabhakara Rao. It is, however, my wish to place before the readers my own estimate of Appa Rao.

No need to stress that a totally perfect human-being is hardly to be seen in the world. Likewise we cannot expect an absolutely perfect work of art in a poet's creation. That poetic work is the best, which serves best in taking human society forward by affording to men and women emotionally, intellectually and aesthetically satisfying experience.

I have appreciated Appa Rao's progressive ideas. I have admired his rational outlook. I

---

[2] Sri Ramana Reddy has written a comprehensive thesis on the works of Gurazada and its name is "Mahodayam".

have enjoyed the sweetness of his language and the clarity and originality of his creation. His beautiful description of nature, which bears the stamp of the surroundings has given me immense joy. Also I have pointed out what I consider inadequacies in his literary creations. In this I have adopted the critical method of the late Dr. C. R. Reddy. I have followed his path. I hope and trust that the readers will appreciate my criticism.

## THE STUDENT WORLD

Today students are living in the atomic age. There is revolution in their ideas, in their outlook and in their tastes. Literary as well as critical works must satisfy their needs and must help their development. Only then will they grow into progressive citizens and work for the building of a new society where all distinctions between rich and poor disappear. The progressive-minded pupils of today are the builders of the India of tomorrow. This little book, I hope, will satisfy to some extent the tastes of such students and gain their appreciation and encouragement.

**GANDHAM APPA RAO,**

MADRAS-5 *Head of the Department of Telugu*

10-10-75. *University of Madras.*

# తొలి పలుకు

ఆంధ్రాభ్యుదయ కవిరాజైన అప్పరాయని ఖండకావ్యా లపై వ్రాసిన చిన్న విమర్శన గ్రంథమిది. అభ్యుదయకాములూ, కళారాధన కుతూహలాయత్తచిత్తులూ అయిన కళాశాల విద్యార్థు లను దృష్టిలో ఉంచుకొని దీన్ని వ్రాశాను.

ఆంధ్ర సారస్వత ప్రపంచంలో నాకు అత్యంతప్రియులైన మహాకవులు ఐదుగురు. వారిలో మొదటివాడు వేమన్న; రెండవ వాడు తిక్కన్న; మూడవవాడు పోతన్న; నాల్గవవాడు సూరన్న; ఐదవ కవి ప్రస్తుతం నేను చెప్పదలచిన అప్పన్న* (అప్పారావు) ఈ అన్నల్లోని అసాధారణగుణవిశేషాలే నా భక్తిగౌరవాలకు కారణాలు.

## వేమన్న

వేమన్న గొప్ప ప్రగతివాది. సామాన్య ప్రజల వాడుక భాషలో ప్రజలకొఱకు కవిత్వం చెప్పిన ప్రజాకవి. కుల మత భేదాలు కూకటివేళ్ళతో పీకివేయమన్నాడు. మూఢవిశ్వాసాలనూ, మూర్తిపూజలనూ నిశితంగా ఖండించాడు. కలవారు కరుణాపూరిత హృదయులై, లేనివాడికి సహాయపడమన్నాడు. ప్రజలు వివేచనా పరులై, విచక్షణాజ్ఞానముతో బాధ్యతాయుత నైతికజీవితాన్ని

---

* విజయనగరం, విశాఖపట్నం ప్రాంతాలలో అప్పన్నలు, అప్పలరాజులు, అప్పల నరసయ్యలు, అప్పారావులు ఎక్కువ. ఇవన్నీ సింహాద్రి అప్పన్నస్వామి నుండి వచ్చిన పేర్లే. అప్పన్నే నాజూకుగా అప్పారావయ్యాడు.

నడుపమన్నాడు. ఉత్తమసమాజనిర్మాణానికి ఈ విధంగా గట్టి కృషి చేశాడు.

## తిక్కన్న

తిక్కన్న సర్వతోముఖ ప్రజ్ఞాధురంధరుడు. ఇతని రాజనీతి విశారదత్వం, ఇతని తెలుగుపదాలలోని వెల్గులు, భావతీక్ష్ణతవిచ్చు ఇతని పదబంధాలు ఆంధ్రావళి మోదాన్ని పొందాయి.

## పోతన్న

అందరు కవులవలె కావ్యకన్యకను రాజుల కమ్మకుండా సమ్మతితో హరికిచ్చి, ఇతడు ఆత్మశాంతిని పొందాడు. కవియైయుండి కాయకష్టంమీద ఆధారపడి కాపుజీవితాన్ని గడిపాడు. మానపౌరుషాలతో బ్రతికాడు. సామాన్యప్రజలైన గొల్లవాళ్ల కథలను వ్రాయుటలో, వారి పల్లెపట్టులను వర్ణించుటలో అత్యంతోత్సాహాన్ని చూపాడు. ఒకవిధమైన ప్రజాకవియై వెలశాడు.

## సూరన్న

ఇతడు ప్రతిభావిశేషాల్లో తిక్కన్నంతవాడు. ఒకరు పోయిన త్రోవ కొరగకుండా ఒక నూతనమార్గంలో కావ్యరచన చేశాడు. ఈనాటి నవలాకథనవిధానాలను కొన్నిటిని ఆనాడే ప్రబంధాల్లో పెట్టిన అనన్యసామాన్యప్రజ్ఞాశాలి. ఇతని సృజనాత్మకశక్తి కల్పనాసామర్థ్యము వర్ణనాతీతములు. ఈ కళాప్రపూర్ణునిగన్న ఆంధ్రమాత ధన్యురాలు.

ఇక అప్పన్న దగ్గరకు వద్దాం.

## అప్పన్న (అప్పారావు)

అప్పారావు అశేషలోకజ్ఞానసంపన్నుడైన అభ్యుదయ కవిరాజు. ఇతని కవితాసిద్ధాంతం విశ్వమానవప్రేమతో నిండిన ప్రగతిశీలమానవత్వం.

మానవతావాది కష్టాలను విన్న వెంటనే కంటతడిపెడతాడు. ఆ కష్టాలకు కారణమేమిటా అని వాటినిగూర్చి తెలుసుకోడానికి గట్టి కృషి చేస్తాడు ప్రగతిశీలుడు. కారణాలు తెలుసుకొని అక్కడతో ఆగకుండా అతడు వాటి పరిష్కార మార్గాలను కనుక్కోడానికి ప్రయత్నిస్తాడు. ఇదీ ప్రగతిశీలుడైన మానవతావాదికీ, వట్టి మానవతావాదికీ గల భేదం. అప్పారాయని కవిత్వంలో అంతటా విశ్వమానవప్రేమతో నొప్పిన ప్రగతిశీలమానవత్వ తొణుకుతూ ఉంటుంది.

## అప్పరాయ - వేమన్నలు

భాషాఛందస్సులలో, అభ్యుదయభావాలలో, సంఘసంస్కరణదృష్టిలో, మానవతావాదంలో, కారణవిమర్శనావిశేషంలో, అహింసాతత్త్వంలో, హాస్యరసప్రియత్వంలో అప్పరాయ - వేమన్నలు అన్నదమ్ములలాంటివారు.

అప్పరాయని ఖండకావ్యాలపై అనేకమంది పండితులూ, అభ్యుదయవాదులూ విలువైన విమర్శనలు చేసి ఉన్నారు. వారిలో అత్యంతముఖ్యులు శ్రీ కె.వి. రమణారెడ్డి,* శ్రీశ్రీ, డా॥సి. నారాయణ

* శ్రీ రమణారెడ్డిగారు 'మహోదయం' అనే పేరుతో గురజాడపై సమగ్ర సంపూర్ణమైన పరిశోధన గ్రంథాన్ని వ్రాశారు.

రెడ్డి, శ్రీ దేవులపల్లి ప్రభాకరరావుగార్లు. నేనుకూడా ఒక విమర్శ నను వ్రాసి సహృదయలోకంముందు పెడుతున్నాను. డొంక తిరుగుడులేకుండా విషయాన్ని సూటిగా, స్పష్టంగా చెప్పడం, సత్యాన్వేషణ నా విమర్శనయొక్క ఉద్దేశం.

సృష్టిలో సర్వగుణ సంపూర్ణుడైన మానవు డుండడు. కవి సృష్టిలో సర్వగుణాలంకారశోభితమైన కావ్యము కానరాదు. మానవాభ్యుదయానికి తోడ్పడే మంచిగుణాలు ఎవనిలో ఉంటాయో అతడే ఉత్తమ మానవుడు. మానవుని మానసికాభివృద్ధికి తోడ్పడి, ముందుకు నడిపించిందే ఉత్తమకావ్యం.

అప్పారావులోని అభ్యుదయభావాలను అభినందించాను. అతని ప్రగతిశీలదృక్పథాన్ని ప్రశంసించాను. అతని భాషలోని ప్రసన్నతా మాధుర్య స్పష్టతలను కొనియాడాను. సహజసుందరమై, దేశీయముద్రతో అలరారిన అతని ప్రకృతివర్ణనలను పొగడాను. అతని కల్పనలో లోపా లని తోచినవాటిని కొన్నిటిని ఎత్తి చూపాను. ఈ విధమైన విమర్శనాపద్ధతిని మనకు కీ॥ శే॥ డా॥ కట్టమంచి రామలింగారెడ్డిగారు చూపించి ఉన్నారు. వారి మార్గమే నాది. ఈ నా విమర్శనకు సహృదయలోకంయొక్క ప్రోత్సాహం లభిస్తుందని విశ్వసిస్తున్నాను.

## విద్యార్థిలోకం

ఇది అణుయుగం. ఇందు నివసిస్తున్న విద్యార్థులలో అభ్యుదయభావాలు, శాస్త్రదృష్టి దినదినాభివృద్ధిగాంచుతూ ఉన్నవి. వారి అభిరుచుల ననుసరించి కావ్యాలూ, కావ్యవిమర్శనలూ ఉండాలి.

అవి వారి మానసికాభివృద్ధికి తోడ్పడాలి. అభ్యుదయభావాలు, శాస్త్రదృష్టి, మానవత్వం గల విద్యార్థులు గొప్ప పౌరులయి మన ధ్యేయమైన కుల, మత విభేదాలు లేని ధనిక, దరిద్ర వ్యత్యాసాలు సమసిన నవసమాజాన్ని నిర్మించ సమర్థులౌతారు. ప్రగతివాదులైన నేటి విద్యార్థులే భావి భారత భాగ్యనిర్మాతలు.

ఈ చిన్న గ్రంథము అభ్యుదయవిద్యార్థిలోకంయొక్క అభిరుచుల్ని కొంతవరకు సంతృప్తిపరుస్తూ, వారి ఆదరాభిమానాలను చూరగొంటుందని ఆశిస్తున్నాను.

గంధం అప్పారావు,
తెలుగు శాఖాధ్యక్షులు,
మద్రాసు విశ్వవిద్యాలయము.

మద్రాసు-600005,
10-10-1975

ఆంధ్ర విద్యార్థులూ—

వేల నెరుగనియట్టి
విశ్వమానవప్రేమ
మీ దేశభక్తికి
మేల్మి దీప్తి నొసంగ

అభ్యుదయభావాల
అమృతంపువాహినుల
విహరించు హంసలై
బహుజనుల బంధులై

సదసద్వివేకులై
సత్కళాభ్యర్థులై
అభివృద్ధి గాంచుడీ
ఆంధ్రవిద్యార్థులూ!

—గంధం అప్పారావు

దేశమును ప్రేమించుమన్నా
మంచి అన్నది పెంచుమన్నా
వొట్టిమాటలు కట్టిపెట్టోయి
గట్టి మేల్ తలపెట్టవోయి

—గురజాడ అప్పారావు

# విషయసూచిక

# ప్రగతిశీలమానవత్వం

ఆంధ్ర సాహిత్య ప్రపంచానికి అప్పారావు జననం అరుణోదయమని చెప్పడంలో రవంతైనా అతిశయోక్తి లేదు. సాహిత్యం మా జన్మహక్కని సగర్వంగా చెప్పుకుంటూ కొద్దిమంది భాషాపండితులే కావ్యామృతరసపానం చేస్తున్న రోజుల్లో సాహిత్యం సర్వమానవుల సొమ్మని చాటిచెప్పి, దాన్ని అందరికీ అందుబాటులోకి తెచ్చిన ప్రజాకవి, ప్రగతివాది గురజాడ.

మహర్షి రఘుపతి వెంకటరత్నంనాయుడి బ్రహ్మసమాజపు మహనీయమార్గం, కందుకూరి సంఘసంస్కరణోద్యమం, గిడుగు రామమూర్తి భాషావిప్లవం—అన్నీ కలిసి అప్పారావు సాహిత్య విప్లవానికి ఒక నూతనోత్తేజాన్నిచ్చాయి. అంతవరకూ పామరభాషగా పడిఉన్న వ్యావహారికభాష నవజీవనాన్ని పొంది, నాగరికభాషమై, నవ్యభావప్రకటనలకు భవ్యసాధనమై వెలసిందీ సంస్కారభావుని కృషిఫలితంగా.

తన మానవత్వ విలసిత మహనీయభావాలు క్రొమ్మెరుంగులు చిమ్మగా ఆంధ్రమాతకు ముచ్చటైన ముత్యాలసరాలు కూర్చి, అలంకరించిన అభ్యుదయ కవిరాజితడు.

అప్పారావు బహుభాషా కోవిదుడు; అశేష లోకజ్ఞాన సంపన్నుడు, నిరాడంబరజీవి, ప్రగతిశీలుడు, విభిన్న

జీవిత విధానాలలోని సత్యాన్ని గ్రహించి, మానవాభ్యుదయానికి తన కవితాకుసుమాలను తోరణం గట్టిన మానవతావాది.

వేమన్నవలె సామాన్యప్రజల సమస్యలను అర్థం చేసుకొని, వాటి పరిష్కారానికై వారి వాడుక భాషలోనే, వేమన్న ఆటవెలదిలాంటి సులభసుందరమైన మాత్యాలసరాలే ఛందస్సులో కవితను చెప్పిన నవయుగ కవికోకిల.

వేమన్న కవిత్వంలోవలె కొద్దిమాటల్లోనే భావాల్ని సూటిగా గుండెకు తగిలేటట్టు చెప్పేశక్తి ఈతని కవిత్వానికి ప్రత్యేకలక్షణం. ఒకరివి నిక్కమైన మంచినీలాలు - ఇంకొకరివి మురిపాల ముత్యాలు.

అప్పారావు ప్రత్యేకమైన ఏ యొక్క జీవితవిధానానికీ, ఏ సిద్ధాంతానికీ చెందిన వ్యక్తి కాడు. అన్ని సిద్ధాంతాలలోని ఉత్కృష్టలక్షణాలను కొన్నిటిని ఇతనిలో చూస్తాము. ఇతడు స్వతంత్రభావుకుడు. మానవత్వాన్ని, మంచితనాన్ని, అభ్యుదయమార్గాన్ని అభిమానించి ఆరాధించువారందరూ అప్పారావును ప్రేమిస్తారు. ఈ సంస్కృతిపరుని జీవితధ్యేయమేమిటో తన కావ్యాలనుగురించి తానై చెప్పిన ఈ మాటల్ని పరికిద్దాం.

"తెలుగులో నవ్యరీతులకు, నూతన ప్రమాణాలకు ప్రయత్నించిన మొదటి కవిని నేనే! నా కావ్యకళ నవీనం. కావ్యములోని ఇతివృత్తం భారతీయం. కవితలో నేను

ఉత్తమ ప్రయోజనాలను ఉపలక్షించాను. జీవితాన్ని నూతన దృక్పథంతో దర్శించి కథాకవితారూపంలో దాని తత్త్వాన్ని అన్వయించటానికి ప్రయత్నించాను. నా కాకళ పట్ల జీవితంపట్ల కొన్ని ఆదర్శాలు ఉన్నాయి. వాటిని సంస్కృతిపరులుమాత్రం అర్థంచేసుకొని హర్షించగలరు. సంస్కృతిశూన్యులు కావ్యకథాసంవిధాన హాస్యధోరణులను గమనించి అంతటితో తృప్తిపడతారు.''

ఈ మాటలనుబట్టి అప్పారాయని ఆశయాలు, ఆదర్శాలు మన కవగత మాతున్నాయి.

## ఖండకావ్యప్రక్రియ

ఖండకావ్యము నవ్యసాహిత్యవీథులలో అత్యంత ప్రసిద్ధిగాంచిన సాహిత్యప్రక్రియ. భామహుడు, విశ్వనాథుడు మొదలైన పూర్వాలంకారికులు కొంతమంది దీనినిగూర్చి కొంత చెప్పినా, మేఘసందేశంలాంటి కొన్ని లఘుకావ్యాల్ని ఖండకావ్యాలని నిర్వచించినా ఇది నిజంగా పాశ్చాత్య సాహితీ సంస్కృతుల ప్రభావంవలననే పరిపూర్ణరూపాన్ని పొందిందని కచ్చితంగా చెప్పాలి.

ఆంగ్లేయులు మనదేశం వచ్చాక మన సమాజ జీవనంలో బ్రహ్మాండమైన మార్పులు వచ్చాయి. ప్రజల అభిరుచులు మారాయి. మను, వసుచరిత్రల్లాంటి మహాకావ్యాలు చదివే ఓపిక వారిలో సన్నగిల్లింది. భాషా సాహిత్యాల్లోని లోతుపాతులు తెలుసుకునేందుకు ఉత్సాహం

తగ్గింది. భావనావికాసాలకు ప్రాధాన్యం హెచ్చింది. రాజుల శృంగార జీవితాలను, రంభల నాట్యరేఖావిలాసాలను వర్ణించే ప్రబంధాలను నిర్మించడం కట్టిపెట్టి, సామాన్య మానవుల జీవితాలను కావ్యవస్తువుగా స్వీకరించే ఉద్యమానికి ప్రోత్సాహం ఎక్కువయింది. నిరాడంబర శైలిలో, సాంఘిక ప్రయోజనాలకొరకు, మానవలోక వృత్తాంతాలకు మాత్రం పరిమితమైన మానవత్వవిలసిత కావ్యాలు వెలువడడం ప్రారంభమయింది.

## వర్డ్సువర్తు

సామాన్య జనుల భాషలో మానవత్వ విలసిత కవిత్వానికి పట్టాభిషేకం చేసిన మహాకవి వర్డ్సువర్తు. ఆంగ్ల సాహిత్య ప్రపంచంలో నవీన ఖండకావ్యప్రక్రియ పూర్ణరూపం పొందడానికి ఇతడే కారకుడని చెప్పాలి. ఇతణ్ణి ఖండకావ్యప్రక్రియాపితామహుడనవచ్చును. ఇతని మైకేల్, లూసీగ్రే, ఆర్టులీప్ వెల్,—మొదలైనవి మానవత్వానికి, మహనీయతకు ప్రతిబింబాలై నిల్చాయి. ప్రకృతి కవిగా, మానవతావాదిగా ప్రపంచ సాహిత్యలోకంలో ఈతని కొక ప్రత్యేకస్థాన మేర్పడింది.

## వర్డ్సువర్తు - అప్పారావు

వర్డ్సువర్తు అప్పారావుకు అత్యంత ప్రీతిపాత్రమైన కవి. ఆతని భాషాసంస్కరణలు, మానవతావాదం, ప్రకృతి

వర్ణనావిధానం అప్పారావును బాగా ఆకర్షించాయి. లవణరాజుకల, పూర్ణమ్మ కథ వర్డ్స్‌వర్తు 'Narrative poem', Lucy gray కథలను తలపిస్తాయి.[1] ఈ మహాకవి గొప్పతనంగురించి అప్పారావు ఒక వ్యాసంకూడా వ్రాశాడు.[2] ఈతని మానవతావాదానికి తన సంఘసంస్కరణ భావాలను, శాస్త్రదృష్టిని జోడించి అప్పరాయకవీంద్రుడు మహోజ్వలమార్గంలో కావ్యరచన చేయడం మొదలుపెట్టాడు.

వర్డ్స్‌వర్తు కావ్యవస్తువులో, భాషలో, భావాలలో వాటిని చెప్పే విధానాలలో గొప్ప సంస్కరణలు తెచ్చి ఒక నూతనమార్గాన్ని చూపినా, ఈతని కవిత్వములో అక్కడక్కడ మర్మకవిత్వపు వాసనలు నిండుకొని ఉన్నాయి. ఇతని భావాలలో శాస్త్రదృష్టికిగాని, సంఘసంస్కరణకు గాని, చోటు లేదు ఇతడు కేవలం ప్రకృతిమాత ఒడిలోని పసిబిడ్డనివంటివాడు. అప్పారావు ఈ విషయంలో వేరుగా కనిపిస్తాడు. ఇతని కవిత్వంలో అస్పష్టతకు చోటులేదు. సంఘసంస్కరణభావాలతో, శాస్త్రదృష్టితో ఇతని కావ్యాలు ఒప్పి ఉంటాయి. మానవుని సృజనాత్మకశక్తిలో నమ్మకమున్న గొప్ప ఆశావాది అప్పారావు. ఈ విషయంలో

---

1. శ్రీశ్రీ గారు అప్పారావుగారి లవణరాజు కలలో (Midsummer Night's Dream) కనబడుతుందన్నారు.

2. కవిత్వము—వర్డ్స్‌వర్తు—గురజాడ రచనలు, వ్యాసచంద్రిక పుట-16.

ఇతని మానవతావాదం కొంతవరకు రష్యా మహాకవి, రచయిత టాల్‌స్టాయికి దగ్గరగా ఉంటుంది. శాస్త్రదృష్టిలో, అహింసా తత్త్వంలో ఇతడు నూటికి నూరుపాళ్లు గౌతమ బుద్ధుని శిష్యుడు.[1]

మానవత్వం, మహనీయత, అహింసాతత్త్వం, శాస్త్రదృష్టి—అంతా కలిసి అప్పారావు రూపంలో ఆంధ్ర సారస్వత లోకాన అవతరించిందని చెప్పాలి.

## ప్రబంధ ప్రక్రియ

"కేవల కల్పనాకథలు కృత్రిమరత్నము లాద్యసత్కథల్
వావిరి పుట్టురత్నము లవారిత సత్కవి కల్పనా విభా
షావహ పూర్వవృత్తములు సానలఁ దీరిన జాతిరత్నముల్
గావున నిట్టి మిశ్రకథగా నొనరింపుము నేర్పు పెంపునన్"

కేవలం కల్పింపబడిన కథలు కృత్రిమరత్నాలవంటివి. వాటికి ఏమీ విలువ లేదు. కేవలం పురాణకథలు సరిచేయని అప్పుడే పుట్టిన రత్నాలవంటివి. వాటిని సానబట్టినగాని ప్రకాశింపవు. అనలంకృతాలు. అందుచేత సత్కవులు ఆద్య సత్కథలను తీసుకొని, ఆ కథలో ప్రధానమైన మార్పేమీ

1. "ఏనాడు బౌద్ధమతం భారతదేశంలో తుడిచిపెట్టబడిందో ఆనాడే భారతదేశం మతవిషయక ఆత్మహత్యను చేసుకుంది." అని అప్పారావు ఒకచోట చెప్పిఉన్నాడు. ఈ మాటలనుబట్టి ఆతని బౌద్ధ ధర్మాభిమానం వెల్లడవుతున్నది.

చేయకుండా అష్టాదశ వర్ణనలతో నింపి, కల్పనా సామర్థ్య మొప్ప వాటిని శోభాయమాన మొనర్చి నిగనిగలాడే సానల దీరిన జాతిరత్నాలుగా రూపొందించాలి. మిశ్రకథయే కావ్యమునకు ఉత్తమోత్తమమైనదని రామరాజ భూషణుని సిద్ధాంతము. ఒక్క రామరాజభూషణుడే కాదు, అతని కంటే పూర్వులు, తరువాతివారునైన పలువురు ప్రబంధకవుల సిద్ధాంతంకూడా అదే. అంతవరకు ఆంధ్రసాహిత్యంలో అనుకరణ రూపంలో వస్తున్న అనువాదపద్ధతిని విరసించి కవి యొక్క కల్పనా సామర్థ్యానికి, వర్ణనాచమత్కృతికి ప్రాధాన్యమునిచ్చే ప్రబంధ ప్రక్రియకు ప్రోత్సాహం ఈయబడిందని ఈ సిద్ధాంతాన్నిబట్టి తెలుసుకుంటున్నాము. పింగళి సూరన లాంటి మహాకవి ఈ సిద్ధాంతాన్ని మొదటిలో లెక్కచేయ కుండా, కేవల కల్పనాకథతో కళాపూర్ణోదయమనే మహా ప్రబంధాన్ని నిర్మించినా చివరకు కాలప్రభావానికి లొంగక తప్పలేదు. అలంకారశాస్త్రానికి అచ్చుపు ప్రతిబింబంలాంటి ప్రభావతీప్రద్యుమ్న ప్రబంధాన్ని సంతరించి సంతృప్తిని వెల్లడించాడు. అప్పటినుండి 19-వ శతాబ్దంవరకు అవి చ్ఛిన్నంగా భాషాపండితులనుమాత్రమే ఆనందపరచే పిల్ల వసుచరిత్రలాంటి ప్రబంధాలు ఎన్నో వెలిశాయి.

అప్పారావు వ్రాసిన చిన్నకథలు, వ్యాసాలు, డైరీలు, ప్రసిద్ధిగాంచిన కన్యాశుల్క నాటకం మొదలైన వటుండగా

ఇతని ఖండికలు సుమారు 12 వరకు ఉన్నాయి. మొదట్లో ఇతడు సంప్రదాయరీతిలో కవిత్వం చెప్పినా తరువాత కొంత కాలానికి (1910 లో) నవీన మార్గాలలో రచనలు చేయడం ప్రారభించాడు. ఇతని ఖండకావ్యాలలో అత్యాంత ముఖ్యమైనవి (1) ముత్యాలసరాలు (తోకచుక్క), (2) కాసులు, (3) లవణరాజుకల, (4) కన్యక, (5) పూర్ణమ్మకథ మొదలైనవి. తరువాతిది ఇతని దేశభక్తి గేయం. ఈ గీతం ఇతని తాత్విక ధోరణికి ప్రతిబింబమై వెలసింది.

# ముత్యాల సరములు

ఈ ఖండిక గురజాడయొక్క మొట్టమొదటి రచన. కొత్తపాతల మేలికలయిక క్రొమ్మెరుంగులు చిమ్మగా ముచ్చటైన ముత్యాలసరాల కూర్పు దీనితోనే ప్రారంభ మైంది. ఒక చిన్న సంఘటనను పురస్కరించుకొని రూప కల్పన చేయబడిన గేయ మిది. అప్పారావు స్వీయానుభవాలు కూడా చాలవరకు దీనికి మూలమని చెప్పవచ్చు. జీవిత ప్రతిబింబమే కదా కావ్యం! అప్పారావుయొక్క నూతన దృక్పథం, సంస్కారభావాలు ఎంత ఉజ్జ్వలమైనవో ఈ ఖండికలో గమనించవచ్చును.

సంస్కారభావుడు, ఆదర్శవాది, ఆవేశపూరిత హృదయుడూ ఐన నాయకుడు బరంపురం పట్టణంలో జరిగిన ఒక సహపంక్తి భోజనంలో పాల్గొన్నాడు. అక్కడ పదినాళ్ల పాటు సంఘసంస్కరణ ప్రవీణుల సాంగత్యంతో మెలిగాడు. ఒకనాటి వేకువ సమయాన ఇల్లు చేరి, నిద్రలో మునిగికున్న ఇల్లాలిని లేపాడు. తాను ఆ పట్టణంలో కనీ వినీ తెలుసుకున్న విషయాలను అత్యంతోత్సాహంతో వినిపింప మొదలు పెట్టాడు.

"కంటివే............మింటను
కాము బాణం బమరి యున్నది'

అన్నాడు. ప్రేయసి దిగ్గున లేచింది. ప్రియుణ్ణి చూడకుండా, ఆకాశాన్ని చూస్తూ కురులను, నగలను కుదురు చేసుకుంటూ ఓరమోము పెట్టింది. అంత నాయకుడు ఇలా ఉపన్యసించాడు.

## భర్త ఆదర్శవాదం

“ధూమకేతువు కేతువనిరో
మోముఁ జందురు డలిగి చూడఁడు!
కేతువా యది? వేల్పు లలసల
కేళి తెలితొగ గాంచుమా!

“అరుదుగా మిను చప్పరంబున
చొప్పు తెలియని యింత పొడవుగ
చన్నకాలపు చిన్న బుద్ధులు
బెదరి యెంచిరి కీడుగా.

“అంతె కాని రవంత యైననుఁ
వంత నే గతి కూర్చ నేర్చునె?
నలువ నేరిమి కంతు యిది యన
నింగి తొడవయి వ్రేలుచున్.

“కవుల కల్పనకలిమి నన్నో
వన్నె చిన్నెలు గాంచు వస్తువు
లందు, క్రొత్త పురాణ గాథలు
నమ్మజెల్లున పండితుల్?

## ముత్యాల సరములు

"కన్ను కానని వస్తు తత్త్వము
కాంచ నేర్పరు లింగిరీజులు;
కల్ల నొల్లరు; వారి విద్యల
కరచి సత్యము నరసితిన్.

"దూరబంధువు యితడు భూమికి;
దారి పోవుచు చూడవచ్చెను—
డెబ్బ దెనబది యేండ్ల కొకతరి
వరుల కన్నుల పండువై.

"తెగులు కిరవని కతలు పన్నుచు
దిగులు జెందుట దేటి కార్యము?
తలతు నే నిది సంఘసంస్కర
ణ ప్రయాణ పతాకగాన్."

"చూడు మును మును మేటివారల
మాట లనిమొడి మంత్ర మహిమను
జాతి బంధము లన్న గొలుసులు
జారి, సంపద లుబ్బెకున్.

"ఎల్ల లోకము లొక్క యిల్లై,
వర్ణభేదము లెల్ల కల్లై,
వేల నెరుగని ప్రేమ బంధము
వేడుకలు కురియు.

"మతము లన్నియు మాసిపోవును;
జ్ఞానమొక్కటి నిలిచి వెలుగును;
అంత స్వర్గ సుఖంబు లన్నవి
యవని విలసిల్లున్.

"మొన్న పట్టణమందు ప్రాజ్ఞులు
మొట్టమొదటిది మెట్టు యిది యని
పెట్టినారొక విందు జాతుల
జేర్చి; వినవైతో!

ధూమకేతువును కేతువని భావించి కాబోలు నీ ముఖ చంద్రుడలిగి వానిని చూడకున్నాడు. అది కేతువు కాదు. వేల్పు లలనల కేలి వెలితొగ (లీలాపుష్పం). అది దర్శనీయమైందే! (చంద్రుడు కలువల జేడు కదా!)

గతకాలపు అల్పజ్ఞులు అరుదుగా అవతరించిన దీనిని కీడుగా భావించి భయపడ్డారు. దీనివలన రవంతైనా కీడు లేదు. బ్రహ్మ నేర్పు పరాకాష్ఠ అందుకొన్నదా అన్నట్లు ఆకాశానికి ఆభరణమై ప్రేలుతూ ఉంది.

వన్నెచిన్నెలు గాంచు వస్తువులందు కవుల యొక్క కల్పనా చమత్కృతు లెన్నో కనిపిస్తుంటాయి. (లేని రూపులు ఏర్పడుతుంటాయి).[1] అర్థంలేని వెఱ్ఱిపురాణగాథల్ని (శాస్త్ర

1. "చందురు డెందమూలోఁ జొరఁబడి వణంకి తోఁక చుక్కయు

దృష్టికి చోటులేని) జ్ఞానవంతులైన పండితులు నమ్మ జెల్లునా !

ఇంగ్లీషువారు కనిపించని వస్తుతత్త్వాన్ని కాంచ నేర్పరు. వారు శాస్త్రదృష్టితో అన్ని విషయాల్నీ అర్థం చేసుకుంటారు. అసత్యాన్ని ఒల్లరు. వారి విద్యాప్రభావం చేతనే నేను యధార్థాన్ని తెలుసుకున్నాను.

భూలోకానికి దూరబంధు వీ ధూమకేతువు. డెబ్బది ఎనుబది ఏండ్ల తరువాత జనుల కన్నుల పండువై దారి పోవుచూ చూడవచ్చాడు.

తోకచుక్క సమస్త బాధల కిరవని ఏవో కథలు పన్నుచు విచారించడం ఏమి కార్యం? తలతు నే నిది సంఘ సంస్కరణ ప్రయాణ పతాకగాన.

ముందు ముందు మానవాళికి సర్వసుఖాలూ, శుభాలూ కల్గనున్నాయని పెద్దలు చెప్పే మాటలనే మంత్ర మహిమ చేత జాతిబంధము లన్న గొలుసులు తెగి జాతి సంపద లభివృద్ధి గాంచుతాయి.

భోలెన్" అని నాచనసోముడు శ్రీకృష్ణుని కపాలముపై నరకాసురుడు వేసిన బాణాన్ని తోకచుక్కతో సరిపోల్చాడు.

"కందర్పకేతువై ఘన ధూమకేతువై
యారు పూఁబోఁడి చేలాంచలంబు"

అని పోతన పూబోడి చీర చెరగును కందర్పకేతువుతోనూ, ఘన ధూమకేతువుతోనూ సరిపోల్చాడు దీనినిబట్టి తోకచుక్క అరిష్టదాయక మనే నమ్మకం కవిలోకంలో స్థిరపడి ఉన్నదని తెలుసుకుంటున్నాను.

ఎల్లలోకములు ఒక్క ఇల్లై (జనతైక కుటుంబమై) వర్ణభేదాలన్నీ నసమసి వేల నెరుగని విశ్వమానవప్రేమ వేడుకలు కురుస్తాయి.

మతాలన్నీ మాసిపోతాయి. వివతుణాజ్ఞాన మొక్కటే నిల్చి వెలుగుతుంది. అంత స్వర్గసుఖాలు ఈ భూలోకంలో విలసిల్లుతాయి.[1]

వినలేదా? మొన్ననే పట్టణమందున బుద్ధిమంతులు కొంతమంది చేరి సహపంక్తి భోజనం ఏర్పాటు చేశారు. కుల, మత భేదరహిత అభ్యుదయ సమాజ సౌధాని కది మొట్టమొదటి మెట్టని చెప్పాల" అని నాయకుడు (భర్త) ధూమకేతువు అరిష్టదాయక మనే జనుల మూఢనమ్మకాన్ని ఖండిస్తూ, వివతుణాజ్ఞానాన్ని పొంది విశ్వమానవ లోకం కుల మతభేదాలు లేక, ఏక కుటుంబమై సమస్త సుఖాలు పొంద నున్నారని నిండు మనస్సుతో భవిష్యద్దర్శనము చేస్తూ అంతటితో తన ఉపన్యాసాన్ని ఆపాడు.

---

1. "నిజంగానే నిఖిలలోకము నిండు మోదము వహిస్తుందా? మానవాళికి నిజంగానే మంచికాలము రహిస్తుందా?" (శ్రీ శ్రీ).

"ఉర్వి వారికెల్ల నొక్క కంచము పెట్టి
పొత్తు కుడిపి కులము పొలయఁజేసి
కలసి చెయ్యి పెట్టి తగ నమ్మ జెప్పరా!"

— వేమన్న వాణి.

అనేవి ఇక్కడ జ్ఞప్తికి వస్తాయి.

## భార్య లోక వాస్తవం

భర్త సంస్కారభావాలకు, ప్రగతిశీల దృక్పథానికి భార్య సంతోషించడానికి బదులు దుఃఖించింది. ఆమె దుఃఖంలో కొంత లోకవాస్తవం లేకపోలేదు.

భార్యకు సంఘసంస్కరణ అంటే ఇష్టంలేదు. వర్ణాశ్రమ ధర్మాలు తూచా తప్పకుండా పూర్వులు నడిచిన త్రోవలో నడవడమే ఆమెకు ఉత్తమ ధర్మం. భర్త ఇంగ్లీషు విద్య నేర్వడంచేతనే అతనికీ పోకిళ్లు వచ్చాయని ఆమె నమ్మకం. ఆమె తన బాధలన్నీ ఏకరువు పెట్టింది. తోడికోడలు దెప్పడం, నాటివారు ఓదార్చడం. మాటలాడకుండా చూచి ఇరుగు పొరుగు మగువలు నవ్వడం, తోడిదాంగని అత్తకు అనుమానం కలిగించేదేమో అని ఆమె కుందడం. 'కాలగతి' అని మామలు ఎంతో విచారించడం, దానికామె సిగ్గుపొందడం —అంతా చెప్పింది. తన చిన్న మనసును చిన్నపుచ్చడం మంచిది కాదన్నది. ఇంత చేస్తాడని తెలిసి ఉంటే తలిదండ్రు లతణ్ణి ఇంగ్లీషు చదువే చదివించి ఉండేవారు కారంటూ భర్త ఆదర్శవాదంపైనీ, బ్రహ్మసమాజపు భావాలమీదా ఇలా బ్రహ్మాస్త్రాన్ని వేసింది చూడండి!

"కలిసి మెలసిన యంతమాత్రనే—
కలుగబోదీ యైకమత్యము;
మాలమాదిగ కన్నె నెవతెనో
మరులు గొనరాదో!"

అన్నది. కోపంతో హేళనగా పల్కిన ఈ మాటల్లో చాలావరకు వాస్తవ మున్నది. సమాజంలో నానా కులాల వాళ్లూ, మతాలవాళ్లూ కలిసి సహపంక్తి భోజనాలు చేసినంత మాత్రాన్నే కుల, మతభేదాలు లేని ఐక్యము కలుగుతుందా ? ఇటువంటి భోజనా లెన్నో చూశాము - చూస్తున్నాము. సంఘసంస్కరణ ప్రవీణుల ఉపన్యాసాలనూ విన్నాము - వింటున్నాము. (వీరేశలింగము, గోపరాజు రామచంద్రరావుగార్ల వంటి ఆచరణవాదులు ఏ కొద్దిమందో కనిపిస్తారు) ఆ భోజనాలూ, ఆ సమావేశాలూ ముగిసిన పిమ్మట తీర్థానికి తీర్థమే! ప్రసాదానికి ప్రసాదమే! దేనికదే! ఎవరికివారే! చెక్కుచెదరకుండా వర్ణాశ్రమధర్మాలు నాలుగు పాదాలా నడువకలసిందే! అంటరానితనంగురించి వేరే అడగనక్కరలేదు.[1] అప్పారావు రోజుల్లో ఆదర్శవాదాలే గాని ఆచరణాలు చాల తక్కువ. (బ్రహ్మసమాజం మాత్రం వర్ణాంతర వివాహోద్యమానికి గొప్ప కృషి చేస్తూ ఉండేది).

నిజంగా నాయకుడు (భర్త) సంస్కారభావుడైతే ఏ మాల మాదిగ కన్నెనో ప్రేమించి పెళ్లి చేసుకోవచ్చుగా! ఆదర్శాలు ఎన్నైనా చెప్పవచ్చు. అవి ఆచరణలో పెట్టడం చాల గొప్పవిషయం. (Example is better than precept)

1. ఇటీవల (1973 మార్చి) జగద్గురు బిరుదాంకితులైన పూరీ శంకరాచార్యులవంటివారు కూడా వర్ణాశ్రమ ధర్మాలలోనూ, అంటరానితనంలోనూ ప్రగాఢ విశ్వాస మున్నట్టు ప్రకటించారు. ఇంతకంటే అనౌచిత్య మింకేముంది?

మానవునకు ఆచరణ ఒక అగ్నిపరీక్షలాంటిది. ఆ పరీక్షకు అతడు తట్టుకోవాలి. అప్పుడే అతడు మహావ్యక్తి అయి ప్రకాశిస్తాడు.

అప్పారావు ఆదర్శాలు చెప్పడంలోనే సంతృప్తిపొందే “వట్టి మాటల సంస్కారి” కాడు. అంతర్వర్ణ వివాహాలు, అందులో ముఖ్యంగా మాల మాదిగ జాతులతో సంబంధాలు జరుగకుంటే కులభేదాలను రూపుమాపడం సాధ్యం కాదనే గట్టి నమ్మక మున్నవాడు. అందుచేతనే కాబోలు ఈ సంస్కృతి పరుడు “లవణరాజు కల”ను కావ్యవస్తువుగా స్వీకరించి, తన సంఘసంస్కరణపతాకను ఎగురవేశాడు.

## గురజాడ ఛందస్సులో కొత్తతనం

గురజాడ శతావధానిగారి విమర్శనకు సమాధానంగా చెప్పిన మాటలనుబట్టి అతని ముత్యాల సరాల ఛందస్సును గూర్చి, దానిని సృష్టించడంలో అతని ఉద్దేశము మొదలగు వానిని గూర్చి తెలుసుకోగలము.

“తెనుగు భాషకు అనుగుణమైన వృత్తముల నన్నింటినీ, ప్రాచీనకవు లెరిగి నిరూపించిరి. ఇక మన స్వేచ్ఛా ప్రచారమునకు అవకాశము లేదు—అనే యెడల కథ ముగిసినది. యూరోపియను భాషలలో కవులు కొత్త వృత్తములను కల్పించి భాషాభివృద్ధి చేయలేదో? కొత్త వృత్తములను కల్పింపవచ్చునన్నచో, నా నేర్పుకొలది నేనొక కొత్త త్రోవ తొక్కితిని, తప్పేమి? నలుగురూ ఆమోదించిరా,

నేను కల్పించిన వృత్తమును అవలంబింతురు, ఆమోదించరా, పరిత్యజింతురు. గాని దానిని గ్రహించుటలో అక్షర విన్యాస మెచట నెచట పెటుకుగా నున్నదో, విరామము లెచ నెచట శ్రావ్యతను చెరచెనో శతావధానిగారు కలవిద్యు రైరి.

ముత్యాల సరములలో నే చేసుకొన్న నియమమిది:—

మొదటి మూడు చరణములలోను సామాన్యముగా పధ్నాలుగేశి మాత్ర లుండును. నాలుగో చరణమున యేను మొదలు పధ్నాలుగు వరకూ వుండును. విరామమును అర్థాను సారముగా చెవి కింపగునట్లు మార్చ యత్నించితిని. ఎంత వరకు నా యుద్యమము కొనసాగెనో, మార్పుల యెడల వసమానము లేని చదువరులు చెప్పవలె.''

(గురజాడ రచనలు—వ్యాసచంద్రిక, పుట–22.)

## మాటల్లో కొత్తతనం

గురజాడ ఆనాటి సమాజంలో వాడుకలో ఉన్న సహజసుందర పదజాలాన్ని ఏరుకొని ముత్యాల సరాలు కూర్చాడు. 'మించి పాయూరు, కొసరెనో యువ, డెబ్బది' మొదలైన మాటల్ని కొన్నిటిని ఉచ్చారణ సహజంగా చెవి కింపుగా ఉండడానికి చిన్న మార్పులు చేశాడు. ఉ, ఊలు; ఒ, ఓలు; ఎ, ఏలు మొదట గల కొన్ని శబ్దాల్ని వు, వూ; వొ, వో; యె, యే లుగా మార్చి వాటిని కొన్ని చోట్ల వాక్యాలలో ఉపయోగించాడు. ఈ మార్పులవలన అంత ప్రయోజనం నాకు కనిపించడం లేదు.

## వస్తువులో, భావాల్లో కొత్తదనం

సంఘసంస్కరణ దృష్టే అప్పారావు కావ్యప్రయోజన మని వేర చెప్ప నవసరము లేదు. జాతి, కుల, మత విభేదాలు లేని అభ్యుదయ సమాజ నిర్మాణమే ఇతని జీవిత ధ్యేయం. దాని కనుగుణంగా కొన్ని సంఘటల్ని సందర్భాల్ని కొన్ని పూర్వ కథల్ని తీసుకొని కావ్యరచన సాగించాడు.

గురజాడ పూర్తిగా హేతువాది కాడు. ఇతనికీ కొన్ని పూర్వ విశ్వాసా లున్నాయి. కొన్ని సందేహాలు కూడా ఉన్నాయి. పూర్తిగా కొత్తదనంలోకి రాలేదు. వీటిని గూర్చి మరొకచోట చెప్పుకుందాం. ఇతడు గొప్ప సంస్కారి, అభ్యుదయవాది అని మాత్రం గట్టిగా చెప్పవచ్చును. ఇతని రచనలు కొన్ని శాస్త్రదృష్టికి నిలయాలు. తోకచుక్క అరిష్టదాయక మనే ప్రజల మూఢ విశ్వాసాన్ని ఖండించ డంలో ఇతడు శాస్త్రదృష్టిని ఉపయోగించాడు.

అప్పారావు తిక్కన్న వేమన్నల లాగ చిన్నమాటల్లో పెద్ద విషయాలు చెప్పడంలో అత్యంత సమర్థుడు. పద లాలిత్యం, స్పష్టత, సంగ్రహశక్తి ఇతని కవిత్వానికి ముఖ్య లక్షణాలు. ఇతడు హాస్యప్రియుడు. హాస్యరసానంద డోలికల స్వేచ్ఛాలీల నూగించడంలో అచ్చంగా వేమన్నకు తమ్ముడు.

## ఇతని ప్రకృతి వర్ణనలో కొత్తదనం

సులభ సుందర పదజాలంతో నిరాడంబర శైలిలో అత్యంత మనోహరంగా అప్పారావు ప్రకృతి వర్ణన చేస్తాడు.

ఈ వర్ణనలో ఇతడు పాశ్చాత్య ప్రకృతి కవిశేఖరుడైన వర్డ్స్‌వర్తుకు సన్నిహితుడు. చూడండి,| ఈ ప్రకృతి వర్ణన ఎంత సహజంగా ఉందో!

రాత్రి అంతరించడం, పగలు ప్రవేశించడం మన కన్నులకు కట్టినట్లు మూడు గేయాల్లో వర్ణించాడు.

"తూర్పు బలబల తెల్లవారెను
తోకచుక్కయు వేగుచుక్కయు;

"చదల చీకటి కదలబారెను;
యెక్కడనో ఒక చెట్టుమాటున
నొక్క కోకిల పలుకసాగెను"

"మేలు కొలుపులు కోడి కూసెను[1]
విరులు కన్నులు విచ్చి చూసెను,
ఉండి, ఉడిగియు, ఆకులాడగ
కొసరెనోయన గాలి వీచెను."

1. మనుచరిత్రలోని కోడికూత వర్ణన చూడండి! ఎంత పాడవయిందో:—

"సకలాశాగతి వర్యకోప విరతిశ్రౌతక్రియారంభణా
త్మక వర్గత్రయికిన్ మదుచ్చరిత శబ్దజ్ఞానమే మూలమిం
తకుఁ బోలన్ వినుఁడంచుఁ దెల్పుగతిఁ జెంకెం గొండపై పల్లెలం
గృకవాకుల్ మొరసెన్ గృహోపరిఁ ద్రిభంగిన్ భుగ్న కంఠధ్వనిన్"

(తృతీయాశ్వాసము — 65-వ పద్యము.)

తోకచుక్క, వేగుచుక్క వాళ్ల రాజైన సూర్యుని కొలువుకు వెళ్లడం, చదల చీకటి కదలబారడం, ఎక్కడో పొరక చెట్టుమాటున ఒక్క కోకిల కూయసాగడం, మేలు కొలుపుచు కోడి కూయడం. విరులు కన్నులు విచ్చిచూడ్డం, ఉండి, ఉడిగియూ ఆకులాడగ కొసరెనో యన గాలివీవడం (ప్రభాత వేళ పిల్లగాలులు) వర్ణన అత్యంత నిరాడంబరంగా నడిచింది.

## అప్పారావు అనుసరించిన పాతపద్ధతి

స్త్రీ ముఖాన్ని చంద్రునితో సరిపోల్చడమనే పూర్వ కవి సంప్రదాయాన్ని అప్పారావు అనుసరించాడు. 'మోము చందురుడు.'

'జలజవర్ణి ముఖము చంద్ర సుఖము'—పోతన.

కేతువు ఒక రాక్షసుడనిన్నీ, అతడు చంద్రునకు శాశ్వత విరోధి అనిన్నీ చెప్పే పురాణగాథను (క్షీరసాగర మథనం) తన కావ్యంలోకి ఎక్కించాడు.

“ధూమకేతువు కేతువనియో

వేల్పులలనల కేలి తెలితొగ”

అని చెప్పడంలో దేవలోకము, అప్సరలు, వాళ్ల చేతి లీలా పుష్పాలు మొదలైనవన్నీ వస్తాయి. ఈ పూర్వ కవిసమయాల్ని పురాణ విశ్వాసాల్ని అప్పారావు తన కవిత్వంలో చక్కగా వాడుకున్నాడు.

ఆకాశానికి ఆభరణమయి లోకచుక్క ప్రకాశిస్తు న్నట్లు వ్రాశాడు. (నింగి తొడవయి వేలుచుక్క) 'మాట లనియెడి మంత్ర మహిమను' అన్నాడు. అంటే మంత్రాల కెంత విలువ కలదో ఆ మేటివారల మాటల కంత విలువ కలదని అర్థం. (మీ మాటలు మంత్రంబులు, మీ మెట్టిన యెడ ప్రయాగ — అల్లసాని పెద్దన) ఈ విధంగా పూర్వ కవుల మార్గాల్ని కొన్నిటిని అప్పారావు అనుసరించాడు.

కవుల చమత్కారాలలో లేని రూపు లేర్పడు తుంటాయి కాబట్టి కట్టె పురాణ గాథల్ని నమ్మవద్దన్నాడు. మూఢవిశ్వాసాలనుండి విముక్తి పొందాలన్నాడు. శాస్త్ర దృష్టి కావాలన్నాడు. ఇంగ్లీషువారు ప్రతివిషయాన్నీ శాస్త్ర దృష్టితో అర్థం చేసుకుంటారు కాబట్టి వారు కల్ల నొల్లరని అన్నాడు. తాను ఇంగ్లీషువిద్య నేర్వడంచేతనే సత్యాన్ని తెలుసుకున్నట్లు చెప్పాడు. ఈ విధంగా కొత్తదనాన్ని తన కవిత్వంలో నింపాడు. మూఢవిశ్వాసాలకు నిలయాలైన ఆ పాతపద్ధతుల్ని అనుసరించడమెందుకు! వాటికి పూర్తిగా వ్యతిరేకమైన కొత్తవిషయాలు (శాస్త్రవిషయాలు) చెప్పడ మెందుకు! ఇది కలవని కలయిక. "కొత్త పాతల మేలి కలయిక క్రొమ్మెరుంగులు చిమ్మగా" అని తన కవిత్వం గూర్చి నోరు విప్పి చెప్పుకున్నాడు. ఈ మేలి కలయికవలన 'చిమ్మే' క్రొమ్మెరుంగులు ఎవరైనా మెచ్చుకోవచ్చును గాని హేతువాద విలసితహృదయులు మాత్రం మెచ్చుకో లేరు.

"మెచ్చవంటా వీవు; నీ విక
  మెచ్చకుంటే మించి పాయెను
  కొయ్యబొమ్మల మెచ్చు కళ్లకు
    కోమలుల సౌ రెక్కునా?'

అని అప్పారావు అన్నా బాధ లేదు.

# కానుకలు

సతీపతుల పరస్పరపవిత్రప్రేమ వారి బాధ్యతాయుత నైతికజీవిత రథానికి సారధివంటిది. ఈ ప్రేమ బాహ్యేంద్రియ సుఖాలకు సంబంధించిన తాత్కాలికమైనది కాదు. రూపరేఖావిలాసాలలో మునిగి తేలిన పరిమితమైనదీ కాదు; ఇది కల్ల కపటము లేని పరిశుద్ధ ప్రేమ. ఇది హృదయ కమల సౌరభము—జీవనసౌఖ్యపథము. ఒకరు నేర్పితే నేర్చుకునే విద్య కాదు. శాస్త్రాలలో చెప్పింది కాదు. పరస్పర గుణాకర్షణవలన ఏర్పడిన శాశ్వత స్నేహబంధము. ఈ స్నేహసంబంధసహకారాలలో దంపతులు జీవనయాత్ర సాగించాలి. ఇదే మానవజీవిత ప్రయోజనము.

ఈ ఖండికలో రెండు పాత్రలను చూస్తాము. సచ్ఛీలుడు, సంస్కారభావుడునైన భర్త నగలు తేలేదని అడిగిన భార్యకు ప్రేమతత్వాన్ని బోధిస్తాడు. ఆమె భర్త చెప్పిన మాటలన్నీ వింటూ మూగసైగలతో తన ఇష్టానిష్టాలను సూచిస్తుంది.

"వినుము...ధనములు రెండు తెరగులు
ఒకటి మట్టిని పుట్టినది; వే
ఱొకటి హృత్కమలంపు సౌరభ;
మదియు నిది యొక్కెడను కలుగుట
యరుదు; సతులకు వేపదగినది
యెద్దియో!..."

ధనములు రెండు విధాలు. ఒకటి మట్టిలో పుట్టింది. ఇంకొకటి హృదయకమలసౌరభము. ఈ రెండూ ఒకేచోట ఉండడం చాల అరుదు. ఈ రెంటిలో సతులకు కోరదగింది ఏదో వాళ్ళే నిర్ణయించుకోవాలంటాడు భర్త.

"మనసులో నీ కుందు
ధన మన నొండు కలదే పసిడి
గాక"ని ప్రాజ్ఞులకె కనికట్టు
కనకము; చపలచిత్తుల కన్ను
చెదరుట చిత్రమా?..."

భర్త ధనంగురించి మాట్లాడునప్పుడు ఆమె మనస్సులో మెదిలింది బంగారము. భర్తకి ఆమె భూషణప్రియ అని తెలుసును. ఆమెకే కాదు; విశేషబుద్ధి గల స్త్రీలకు కూడా బంగారము కనుకట్టులాంటిది. ఆమెకు మాత్ర మెందు కలా గనాలి? ఆమె సౌందర్యవతి. ఆభరణాలకే ఆభరణమని కూడా భర్తకు తెలుసును. ఆమెకు తెలియదు. ఆమెకు వెలలేని శాశ్వత సౌందర్యాన్నిచ్చే సొమ్ములు బహూకరింపగోరుతాడు భర్త. అదే అనురాగం. అదే పవిత్రప్రేమ.

"......సతుల సౌరను
కమల వనముకు పతుల ప్రేమయె
వే వెలుంగు; ప్రేమ కలుగక బ్రతుకు
చీకటి—"

భార్యల అందాల కమలవనాలకు భర్తల ప్రేమ సూర్యకాంతి. ప్రేమ కలుగక బ్రతుకు చీకటి. ప్రేమనిచ్చిన ప్రేమ వచ్చును. ప్రేమ నిలిచిన ప్రేమ నిలుచును. అది పరస్పరానుకూల్యంవల్ల ఏర్పడుతుంది. పరస్పర గౌరవంవల్ల రూపొందుతుంది—అని ప్రేమవృక్షాన్ని పెంచే సూత్రాలు భర్త ప్రవచించాడు.

"మరులు ప్రేమని మది దలంచకు
మరులు మరలును వయసుతోడనె
మాయమర్మము లేని నేస్తము
మగువలకు మగవారి కొక్కటె
బ్రతుకు సుఖముకు రాజమార్గము"

"ఇంద్రియసుఖాలకై యేర్పడిన ప్రేమ ఇంద్రియాల బలం ఉడిగిపోగానే పోతుంది. యౌవనం ఝురీవేగతుల్యం. వయసు పోగానే పోతుంది. మాయ మర్మము లేని స్నేహా మొక్కటే దంపతుల సుఖజీవితానికి రాజమార్గం. జీవితాంతంవరకు నిల్చి జీవితాన్ని శోభాయమానం చేస్తుంది." అని కామానికి ప్రేమకు గల భేదం నిరూపించాడా సంస్కారభావుడు.

"కాసు వీసము నివ్వ నొల్లక
కవిత పన్నితి నని తలంపకు;
కాసు లివె; నీ కంఠసీమను
జేరి బంగరువన్నె గాంచుత।
మగడు చేల్పన పాతమాటది."

ప్రేయసీ, కాసు పీసము ఇవ్వలేక కల్పించి చెప్పా ననుకోకు. కావాలంటే ఈ కాసులదండ తీసుకొని కంఠ సీమను వేసుకో; గాని నా మాటలు మనస్సులో ఉంచుకో. మనం స్నేహితులము. అధికార అనధికార భావానికిగాని, ప్రభువు-సేవకురాలు అనే ధర్మానికిగాని మన దాంపత్యంలో చోటివ్వరాదు. భర్తే దైవము, అతని సేవకురాలను నేను— అన్నమాట పాతమాట.

ఇది గురజాడ ప్రేమతత్వం. ఇతని ప్రేమ తత్వంలో శాస్త్రదృష్టి నిండి తొనకుతూ ఉంటుంది. ఇదే ఇతర మానవతావాదులకూ ఇతనికీ గల భేదం. ఇతని కావ్య సుందరి శాస్త్రదృష్టి గల గుణాలంకారశోభిత. నిరాడంబరు రాలు.

## వేమన్న

ఈ సందర్భంలో వేమన్న కావ్యసుందరి మన హృదయనేత్రాలకు గోచరిస్తుంది. ఆమె ఎటువంటిదో చూద్దాము.

"కలువరేకువంటి కన్నులుండిన నేమి?
చిలుక పలుకులట్లు పలుక నేమి?
తెలివి బలిమి గల్గి తేజరిల్లగ నేమి?
తులువగామి యలరు నెలత వేమ."

ఒక్క శీలం లేకుండా ఎన్ని లక్షణాలున్నా ప్రయోజనం లేదు. శీలవతియైన గుణాలంకారను సంస్కృతిపరుడైన

భర్త మనసార ప్రేమిస్తాడు. ఆమె భర్తయొక్క ప్రేమ సామ్రాజ్యానికి మహారాణి ఔతుంది. వారి దాంపత్యం మధురాతిమధురం.

"పనస తొనలకన్న పంచదారలకన్న
జుంటి తేనెకన్న జున్నుకన్న
చెఱకురసముకన్న చెలిమాట తీపురా॥"

ప్రేయసి మాటలు ఆ సంస్కారభావునకు ఎంత తీపో చెప్ప నలవి కాదు.

బాహ్యాలంకారగర్వితలు, శరీరమాత్ర సౌందర్యారాధన సంతృప్తమానసలు, కామశాస్త్రోపాధ్యాయినులు అయిన ప్రబంధ సుందరులు ప్రవృత్తిభోగానందతత్పరులైన రసికశేఖరులను అలరించినట్లు అప్పారావు-వేమనల కావ్యసుందరులు ఆనందపరుపగలరా?

# లవణరాజు కల

దీనికి మూలం సంస్కృత యోగవాసిష్ఠం. లవణుడు ఉత్తర పాండవ జనపదానికి రాజు. హరిశ్చంద్రుని వంశము వాడు. ధార్మికుడు, ధీరుడు. అతని కథను వసిష్ఠుడు రాముడికి చెబుతాడు. కథ పేరు 'ఇంద్రజాలోపాఖ్యానము'. రామరాజ భూషణుడు చెప్పిన ప్రబంధ నిర్మాణ సిద్ధాంతాన్ని పూర్తిగా పాటించకపోయినా, అప్పారావు ఈ ఆద్య సత్కథను (లవణ రాజుకల) తీసుకుని, తన అశేష ప్రతిభావిశేషాలచ్చువడ, తన సంఘసంస్కరణ భావాల కనువుగా మార్చుకున్నాడు. ఒకవిధమైన సానలదీరిన జాతిరత్నం చేసుకున్నాడు.

ఈ కథకు బీజం లవణరాజు చండాలస్త్రీని పెండ్లాడి ఆమెతో కష్టసుఖాలు అనుభవించడం. ప్రపంచరూపమైన ఇంద్రజాలమంతా మనస్సునకు అధీనమై ఉన్నది. మనోరథ స్వప్నసుఖాదులందు ఈ చిత్తము అనేక యోజనాల దూరం కూడా గోష్పాదతుల్యం చేస్తుంది. మనస్సు క్షణాన్ని కల్పం గానూ, కల్పాన్ని క్షణంగానూ చేస్తుంది. కాబట్టి దేశకాలా దులు మనస్సున కధీనములని విజ్ఞులు వచిస్తున్నారు. అంతా చిత్తం మీదనే ఆధారపడి ఉంటుందని, అవిద్య భ్రమను కలుగజేస్తుందని వసిష్ఠుడు రాముణ్ణి హెచ్చరించాడు.

అప్పారావు ఈ కథను సూటిగా తీసుకుని తన ఆశయాల కనుగుణంగా, ఉచితస్థానాలలో సంధ్యాచంద్రోదయాది వర్ణ నలు చేస్తూ అత్యంతమనోహరంగా చిత్రించాడు. భార్యా

భర్తల పవిత్రప్రేమ, మంచిచెడ్డల నిరూపణం, సంకుచిత కుల వ్యవస్థ నిర్మూలన, ప్రశాంతజీవనం మొదలైన సొంత భావా లను స్థాపించి సుందరమైన ఖండకావ్యంగా నిర్మించాడు.

మూలంలో కథాప్రారంభము రాజుగారి యశోవర్ణ నతో మొదలౌతుంది. ఈ వర్ణన రెండు శ్లోకాలలో కావ్య సంప్రదాయమున కనుగుణంగా చేయబడుతుంది.

అప్పారావు దీనిని అనుకరించకుండా మరొక విధంగా కథను ప్రారంభిస్తాడు. లవణుడనే రాజు నిండు కొలువు తీరి ఉండగా ఐంద్రజాలికుడొకడు అతణ్ణి సమీపించి, దండీనృప! వొక గుండు గారడి కలదు, చూడండి! అని కోరుతాడు— ఇత్యాదిగా కథ ప్రారంభమౌతుంది.

లవణరాజు అడవిలో మాయగుఱ్ఱాన్ని వదలి భూమి మీద కాలు పెడతాడు. అతడు పుడమికి తగలగానే బడలిక వలన అతనికి మృతునట్లు ఒడలు తెలియని గాఢనిద్ర వస్తుంది. మేలుకొని కనువిప్పి జన్మాంతరము తెరగున కన్నుల ఎదుట వెలసిన వింతలోకపు సంజకెంజాయను కలయ చూస్తాడు. మూలములోని పూర్వసంధ్యను తాను అపరసంధ్యగా మార్చుకొని ప్రకృతివర్ణన ప్రవేశపెట్టి, ముందు జరుగనున్న శృంగారఘట్టానికి రమ్యమైన రంగాన్ని సృష్టించాడీ మహాకవి. ప్రారంభమునుండి యింతవరకూ జరిగిన కథను గబ గబా పదహారు పద్యాల్లో తేల్చివేశాడు. సహృదయుడు, సంస్కారభావుడనైన లవణరాజు ముందు రానున్న మాతంగ సుందరిని పెండ్లాడె రమణీయ సన్నివేశాన్ని పాఠకలోకానికి

విసుగు కలిగించకుండా అత్యంత త్వరగా చూపించడమే అప్పారావుయొక్క ధ్యేయం.

### ప్రకృతివర్ణన - పరిమిత నిర్మలిన శృంగారము

స్పష్టంగా, సంగ్రహంగా, నిరాడంబరమైన శైలిలో రమణీయపదజాలముతో పద్యరచన చేయుటయందు అప్పరాయకవి వేమన్నకు అత్యంత సన్నిహితుడు.[1] ఇతని కవిత్వంలో కాగడా పట్టి వెదకినా ఒక కఠినపదము కనిపించదు. ఇతని ప్రకృతి వర్ణన సహజసుందరమై దేశీయతాముద్రతో నలరారి మనోనేత్రాలకు విందు నిస్తుంది.

"వెలుగు నీడలు కనుల కింపై
మెఱఁగి చెలగెడి నాకసంబున
వ్రేలు మబ్బుల యంచులంటను
రగిలె రత్నరుచుల్—"

అని మలిసంధ్యావర్ణన చేశాడు.

"గగన రాజ్యము గ్రమ్మ వేడుక
మగటిమిని తన కళలు కూర్చుచు
పగలు వెన్నెల దన్ని సోముడు
పైనమై వెడలెన్—

1. "గంగ పారుచుండు కదలని గతితోడ
ముఱికి నీరు పాఱు మ్రోతతోడ..."

శాంతగంభీరాలు సంతరించుకొని గంగ కదలని గతితోడ పాఱుతూ ఉంటుంది. మురికి నీరు దబదబా శబ్దంతో పారుతుందని వేమన్న చెప్పాడు. ఈ మాటలు అతని శైలికి కూడా అన్వయిస్తాయి.

ఈ విధంగా చంద్రోదయాన్ని ఒక్క చిన్న పద్యంలో చెప్పాడు.

"పారె పక్షులు పౌజు పౌజుల
జేరె కోయిల లొకటి నొకటిని
దూరి గూడుల బాస లాడెను
పిట్ట లెల్లెడలన్

తాడి వనముల తూర్పు కొండను
గొడుగు లెత్తెను చామరంబులు[1]
నిలిపె జిలుగు లుడుగణంబులు
దవ్వులను నిలిచెన్

చల్ల గాలులు సాగి యలలుగ
జల్లు జల్లున రాల్చె పూవుల;
ఉల్ల మలరెను; ఆకలొక్కటె
బడబవలె నడరెన్"

చల్లగాలులు సాగి జల్లు జల్లున రాల్చే పూల వర్షము వలన లవణరాజు మనస్సు అలరింది. కాని ఆ యానంద ముతో కూడా బడబవలె ఆకలి అతణ్ణి వేధిస్తున్నది.

ఇంతలో అతని చెవులకు దూరంనుండి క్రమంగా వింత గానం వినిపించింది. వినిపించగానే అతనిలో పూర్వవాసనలు

---

1. శ్రీకాకుళం, విజయనగరం, విశాఖపట్నం ప్రాంతాలలో ఎక్కడ చూచినా తాడివనాలే. ఇదే అప్పారావు ప్రకృతి వర్ణనలోని దేశీయతాముద్ర.

స్ఫురించిన ట్లయ్యాయి. ఆ గాన మాధుర్య మెప్పటిదిదో కాని లవణుడు ఆకలిదప్పులు కూడా మరిచాడు. పరవశుడైనాడు. ఆ గాన మెవరిది? లావణ్యాలవారిధియైన మతంగ కన్యది. లవణరాజు 'దరియు గాంచెను శ్యామలాంగిని నొక్క జవ్వనిని'. ఆమె ముగ్ధమనోహర రూపాన్ని, నడకలోని సోయగాన్ని, ఆమె గానమాధుర్యాన్ని అప్పారావు ఎంత మనోహరంగా వర్ణించాడో చూడండి.

"అర మొగిడ్చిన కన్నుగవతో
చెదరి యాడెడి ముంగురులతో
బెదరు ఎరుగని బింక మొప్పిన
బెడగు నడకలతో—"

"కూటి కడవను బుజముపై నిడు
వాట మదియొక మురువు గులుకగ
పాట పాడెను పాటలాధరి
చెట్ల చామలకై—"

"పాట పాడెను చెట్లు చామలు
కోటి చెవులను గ్రోలి యలరగ;
తాటి వనమున, నాగి చంద్రుడు
తాను చెవి యొగ్గన్—"

అప్పారావు స్త్రీ శృంగార వర్ణనలో పొరపాటుగనైనా ఎక్కడా ఒక్క అశ్లీలమైన మాట దొర్లదు. అర మొగిడ్చిన కన్నుగవతో, బెదరి ఆడుతుండే ముంగురులతో

బెదురులేని బింక మొప్పిన బెడగు నడకలతో కూటికడవను బుజముమీద పెట్టుకునే వాటము ఒక విధమైన మురువు గులకగా ఆ పాటలాధరి పాట పాడింది. ఆ పాట ఎవరినిగురించి? ఎవరినిగురించి కాదు; చెట్ల చామలకై, పాడింది. ఆ చెట్లు, చామలు కోటి చెవులతో ఆ గానమాధుర్యాన్ని గ్రోలాయట. తోటి వనమున ఆగి చంద్రుడు కూడా ఆ పాటను విన్నాడట. ఈ వర్ణన ఎంత సహజరమణీయంగా ఉన్నదో పరికించండి. ప్రకృతిశోభకు ముద్దుబిడ్డగా, పరమసాధుశీలగా, పవిత్రశృంగారరస దేవతగా కథానాయికను మన కన్నుల ముందు పెట్టాడు గురజాడ కవి.[1]

1. మడికి సింగన వాసిష్ఠరామాయణంలో ఈ సన్నివేశాన్ని ఎలా చిత్రించాడో చూడండి :

క. ఆలంబిక శాఖుఁడనయి
ప్రేలుచు దిగ వెలిచి — తీవ్రవేదన నగలం
దూలుచు శాఁకట నెంతయు
జాలిం బడునంత వేగి సవిత్రుఁడు వొడిచెన్.

వ. అట్టియెడ నలుదిక్కులుఁ జూచుచు భయభ్రాంత చిత్తుండనై యుండ నవ్వనాంతరంబునందు.

ఉ. చేతుల గాజులున్ జెవుల జెట్లును బొట్టును దాటియాకులున్
వాతెల తీరునై పలుపు వాలికకన్నులు నల్లపూవునన్
భాతి దలిర్ప నొక్కరతి యనామిక గ్రద్దన గంప మోచికొం
చా తెరువట్టి చేనికడ కంబలి తండ్రికిఁ గొంచుఁబోవఁగన్.

క. కని డాయఁ బిలిచి నా న
చ్చిన తెలుఁగున బడ్డ వగులు జెప్పుచుఁ దరుణీ

ఈ సందర్భాన్ని ఏ ప్రబంధకారుడైనా వర్ణించి ఉంటే వేరు విధంగా ఉండేది. కనీసం నాయికామణి రహస్యాంగాల్ని వర్ణించి మనముందు పెట్టిండేవాడు.

మనుచరిత్రలో ప్రవరునిమీద మగువ పొలపు తెలిపే చిక్క మారుతం పడ్డది. అత డా వాతపరంపరా పరిమ

నను డింపు మన్న మాటలు
విని యదియును గంప దింపి వెలవెల నగుచున్.

గీ. కానిమ్ము దానఁ గదిమి యింక వచ్చునే
యనిన మాట కేను ననుమతింప
లేక యదియు రెండు రాలెత్తుగాఁ జేసి
యొక్క కొంత కొన రొకింత లేక.

ఉ. నన్నును గౌఁగిలించి వదనంబు నురంబును జేర్చి డింపుచోఁ
జన్నులు సోఁకి మైఁ బులకజాలము నిక్కినఁ జిత్త మెంతయున్
వెన్నవిధంబు దోఁప ననవిల్తుని బారికి నగ్గమైతి నా
యన్నను నన్ను డించి మెలఁగ మల్లన ప్రాల్చుచుఁ బాపి నిల్చినన్.

వ. దానితో నిట్లంటి.

క. నిన్నటి నుండియు నాఁకట,
నున్న నిమిత్తమున దాస మొందవేను; మేనున్
గన్నులును దిమ్మదిరిగెడుఁ
గ్రన్నన నా దప్పి దీర్చి రక్షింపఁగదే.

అనిన నా చండాలి నా యభిప్రాయం బెఱింగి తను తెచ్చిన పర్యుషితాన్నంబునం గామోపచారంబులం బరితోషం జేసిన నేనునుం దాని చేసిన తగవునుం దగులంబు నగ్గలించి విడువ నోపక తజ్జనకానుమతంబున వివాహంబై దానియింటనె యుండి దానివలన నలుగురు కొడుకులం గని పెద్దకాలం బా చండాల సుఖంబు అనుభవించుచు నుండ.

శాన్ని అనుసరిస్తూ జనాన్విత మచ్చోటని చేరబోయి చూశా డట. ఎవరిని? విద్యుల్లతా విగ్రహాఙ్, శతపత్రేక్షణన్, చంచరీక చికురఙ్, చంద్రాస్యన్, చక్రస్తఙ్, నతనాభిఙ్, నవలా, నీకానీక మరున్నారీశిరోరత్నముఙ్. చక్రవాక పక్షులలాంటి స్తనాలు, లోతైన బొడ్డు గల అందాల రాశి యైన వేల్పుసాని రహస్యాంగాల సొబగు లోతులు వర్ణిస్తే తప్ప అల్లసానివారికి ఆత్మసంతృప్తి లేకపోయింది. అక్క- డితో ఆగాడా ఆ మహాకవి? ఆగలేదు. ఆమె ధరించిన ధవళాంశుకములోని యంగదట్టపు కావిరంగువలన చంద్ర కాంతమణిపీఠి జాజువారిందట! వీణ కమర్చే కాయలు ఎత్తైన కుచపాళి నత్తమిల్లేయుట! ఇంకా ముందుకుపోయి ఆమె ఆలాపనలోని హాయిని వర్ణించాడు. "ఆలాపగతిఁ జొక్కి- యరమోడ్చు కనుదోయి రతిపారవశ్య విభ్రమము తెలుప"—అని సంభోగాంత సౌఖ్యంపు బ్రహ్మానందము యొక్క- అంచులు చూపించాడు రసిక పాఠకలోకానికి.

## నిర్మల సంభాషణ - విశృంఖల దాంపత్యనిష్ఠ

లవణరాజు మతంగకన్య రూపవిలాసాలను తిలకిం చాడు. ఆమెను ప్రేమస్వరూపిణిగా, మూర్తీభవించిన మంచి తనముగా భావించాడు. తన హృదయ సామ్రాజ్యానికి పట్ట మహిషిని చేసుకోదలచాడు. ఇలా అన్నాడు.

"వినుము. కిన్నరీ, నీకు దేవుడు అన్ని శుభాలు కూర్చుగాక! నిన్నటినుండి నాకు అన్నము లేదు. చాలా

ఆకలిగా ఉంది. అంతకంటె అధికమైన వింత ఆకలి మన స్సును బాధిస్తున్నది. దానినిగూర్చి ఇంతింతని చెప్పలేక ఈ విధంగా వెంబడిస్తున్నాను.''

ఆ మాటలు విని ఆ మతంగకన్య మెల్లగా అర మోడ్చిన కన్నులను విప్పి రాజువైపు తేరిపార చూచింది. ఆ చూపు లవణరాజుకు పూర్ణబ్రహ్మానందాధిరాజ్యము పూనినట్లయింది. జవాబు చెప్పకుండా మళ్లీ చూపులు దించుకొని ఆలోచించుకొంటూ వెళుతున్నపుడు తన నడకలో వెనుకటి సోయగము, హుందా తొలగాయి. గానము లేదు. ముఖాన చింతమాత్రము అలమింది. ఆలోచనా పరంపరలు హృదయాన్నాక్రమించాయి.

''పండువెన్నెల కుముదవనిపై
బిందు గమ్మిన నీడకైవడి
నిండె మోమున చింత యొక్కటి
మరల నేనంటిన.

లవణుడే మళ్లీ మాట్లాడాడు.

''ఆకలితో బాధపడుతున్నవానికి అన్నము పెట్టుట సుకృతమని మున్ను పెద్దలు వచించి ఉన్నారు. అది నీకు తెలియకుండా ఉందా! సుందరీ! నీ పవిత్రమూర్తికి భృత్యుడ నౌతాను. మృత్యుముఖాననున్న ఈ సేవకునికి అన్నము పెట్టి కాపాడు''మని అన్నాడు.

పూర్వజన్మవాసన లామెను పూర్తిగా విడనాడ లేదు. లవణరాజునకు ఆ స్పృహా ఉంది కాబట్టి భృత్యుడ

నాదును. ఛటున కన్నమిావలదో అని దీనాతిదీనంగా ప్రార్థించాడు. అంతేగాని కామదృష్టితో తొందరపడి అన్న మాటలు కావు.[1]

“చన్న బ్రతుకుల కొలిచి కుడిచిన
తెన్ను మనసున కొంత తోచెడి
నిన్న యన్నదె నేడు రేపులు
అన్యు నెట్లగుదుఁ—”

గత జన్మముల కొలిచి కుడిచిన తెన్ను మనసున కొంత తోచెడిది అని చెప్పి అన్యుడను. కా నన్నాడు. ఆ మాట లాలించి మతంగకన్య వినయ ముట్టిపడ శిరంబు వంచి “నే నెవరో తెలియక అన్న మడుగుతున్నా. నేను మాలెతను. అన్నము పెట్టడానికి అర్హురాలను కాను. అయ్యకోసము ఈ కూడు తీసుక వెళుతున్నాను. అన్నము పెట్టవా? అన్నమాట నా హృదయాన్ని వ్రయ్యలు చేస్తున్నది. నా భాగ్యానికి ఎవరి నేమందును? అన్నది. ఆ మాటలు లవణరాజుకు విసంపుభల్లముకన్నా వాడియయి హృదయంలో దూరగా ఖిన్నుడయి కొన్ని నిమిషాలు ఎన్నెన్నో కన్నవి విన్నవి ధర్మాల నెన్నుకొని వాటిలో ఒక పరమమానవ ధర్మాన్ని కనుగొని ఈ విధంగా మనస్సులో చింతించాడు.

---

1. “కామార్తా హి ప్రకృతి కృపణాః చేతనాచేతనేషు” కామాతురులు విచక్షణా జ్ఞానాన్ని గోల్పోయి వ్యవహరిస్తారని (కరము దీనులు కదా కామపీడితులు) కాళిదాసు మేఘ సందేశంలో చెప్పాడు.

# హరిజనోద్ధరణము

ఒక దేశంలో కొంతమంది సంఘుబలం కలవారు మలినవృత్తులు గలవారిని మాలలని ఒక కులాన్ని సృష్టించి వారిని వెలిబెట్టారు. ఒక్క వేటున పశువులను చంపిన వారికి కులంలేదట. తోడి మానవుల్ని సదా హింసిస్తుండే క్రూరకర్ములకు కులమున్నాదట. మలినదేహుల మాల లంటూ మలినచిత్తులైన సవర్ణులకు నెలవొసంగిన ఈ హిందూ వర్ణాశ్రమ ధర్మము ధర్మమని చెప్పబడిన అధర్మమే—అనెడి నిశ్చయ మాత్మ తోపగ లవణుడు మాలెతతో ఈ విధంగా అన్నాడు.

ఓ కన్నియా! వినుము. జనులు తెలియక మిమ్మల్ని మాలలని పిలుస్తున్నారు. దానికి విచారించవద్దు. ఎంచి చూడగా మనుష్యుల్లో మంచి చెడ్డ రెండే కులాలు. ఆ మంచి అన్నది మాలే నైతే మాలనే, నే నౌతాను.

తెలివి రాబులికే తేట కన్నులు మురువు గులికే ముద్దు మోము, దేవతాస్త్రీలు కూడా నేరని గానమాధుర్యం, చిత్తరువులందైన గనని పవిత్రరూపపు సౌష్ఠవమును ఉత్తమోత్తమమైన జాతిలక్షణాలు. యుక్తిసంపద గల మాల యనువారున్న వారల మందబుద్ధి విచారించాలి. తన యందు లేని లోపము కలదని వగవగా నెందుకు?

ఓ తెరవా! భయము వీడి నన్ను విశ్వసింపుము. అన్నముపెట్టి నన్ను చేకొనుము. మూర్తీభవించిన మంచి

తనమైన నిన్ను నిశ్శంకగా వరిస్తాను. నా హృదయంపు రాజ్యాన్ని 'నిస్సపత్నము'గా ఇచ్చుకొనేందుకు సిద్ధపడ్డాను.

మతంగకన్య సిగ్గు విస్మయము ముఖమున పొడమి పొరగ కనుల నెత్తుచు డించుచు లవణరాజుతో 'తండ్రి కోసము తెచ్చిన కూటిని తిండికై ఇతరుల కెట్లు ఇవ్వగలను? పెండ్లియాడిన పెనిమి టొక్కనికిమాత్రం పెట్ట ధర్మము. ఇప్పటికే చాలా ఆలస్యమైంది. తల్లడిల్లుచు తండ్రి నాకై ఎదురుచూస్తూఉంటాడు. నేను త్వరగా వెళ్ళాలి' అని చెప్పి రాజునుండి తప్పించుకొను భావాన్ని అగుపరిచింది. భర్తగా అంగీకరించిన లవణుడు ఉద్రేక మాపుకోలేక,

కరము బట్టి యూరంబు ఉరమున
 చేర్చి ముద్దిడి కురులం దువ్వితి
 తాళవనమున వెడలి చంద్రుడు
  వచ్చెనను నవ్వేక

ఆడబోయిన తీర్థ మెదురై
 వేడబోయిన వరము వచ్చెను;
 పెండ్లి యాడవ చంద్రు సాకీగ
  పెట్టు కూడింకక

మున్ను వేల్పులు వెన్నచేతను
 గొన్న యమృతముకన్న రుచులను
 చెన్ను మీరెను కూడు కన్నియ
  చేత నిడినంతక

ఈ విధంగా ఈ సాధుశీల సంస్కారభావుల శృంగారము స్థాయిభావము నందుకొన్నది. అమృతతుల్యమైన కూడు ఆరగించాడు లవణరాజు. నాయికానాయకుల నిర్మల సంభాషణ, దుర్మోహరహిత బాధ్యతాయుత నిశ్చల దంపతీ నిష్ఠ ఆదర్శభూతములై శోభాయమానములై పరిసమాప్తి గాంచినవి. సంకుచిత కులవ్యవస్థను గూర్చి హరిజనోద్ధరణకై లవణరాజు ఉపన్యసించిన విధము అప్పారావుయొక్క సంఘ సంస్కరణభావాలకు, ప్రగతివాదదృక్పథానికి ప్రతిబింబాలని చెప్పాలి.

## సంస్కృతి నిర్వచనం

కుల్లును తూలనచేసి శుభ్రత నొసగేది, దుర్గంధ పూరిత వాతావరణాన్ని సుగంధభరిత మొనర్చేది, మంచితనాన్ని, మానవత్వాన్ని, మహనీయతను పెంపొందచేసేది సంస్కృతి. సంస్కృతి మానవుని మానసికాభివృద్ధి. సంస్కృతిపరుడు క్షమాగుణ సంపన్నుడు; సహనశీలుడు; పతితపావనుడు; కరుణానిధి. ఒక్కమాటలో చెప్పాలంటే అతడొక మహాపురుషుడు.

## చండాలవాటిక

అప్పారావుయొక్క సంస్కృతి అతనిచే సంస్కరింపబడిన చండాలవాటికలో కానవస్తుంది. మూలంలో చండాలవాటిక అత్యంత భయంకరంగా, నీచంగా వర్ణింపబడింది. అక్కడ కాకులు, కోళ్లు, కోతులు ముక్కలు ముక్కలుగా ఖండింపబడి పడి ఉంటాయి. రక్తసిక్తమైన నేలపై గ్రద్దలు

వ్రాలి ఉంటాయి. ఎండబెట్టబడిన తడి ప్రేవులపై పక్షులు తిరుగాడుతూ ఉంటాయి. ఎండుతున్న జంతువుల క్రొవ్వు గుడిసెలముందు పరపగా వాటిపై పక్షులు వచ్చి చేరు తుంటాయి. ఇటువంటి నీచాతినీచమైన వాతావరణాన్ని అప్పారావు అత్యంత ప్రశాంత వాతావరణంగా సంస్కరించాడు. ఈ మార్పులు అతని అభ్యుదయ భావాలకు, శీలసంపదకు, పాత్రౌచిత్యానికి పతాకలై నిల్చాయి.

## మాలెత తండ్రి

మాలెత తండ్రి కూడా మూలంలో అత్యంత భయంకర వ్యక్తిగా చిత్రింపబడతాడు. 'భయప్రదుడు' 'కృతాంత సదృశుడు' అని ఇతడు వర్ణింపబడ్డాడు. అటువంటి భయంకర మూర్తిని అప్పారావు పరమశాంతమూర్తిగా, ప్రియదర్శిగా, నైతికజీవనసంపన్నుడుగా, రాజఋషిగా చిత్రించాడు. ఈ చిత్రణలో అతని బౌద్ధసంస్కృతిని మనం చూడగలము.

"పండుగెడ్డము; నిండు కన్నుల
నిండ శాంతరసంబు; పలుకుల
కడలి గాంభీర్యంబు, యొడలిని
దివ్య తేజంబున్ —"

"కలిగి కూచున రాజఋషివలె
రావి క్రిందను రచ్చ శిలపై
కొమ్మలను జేరి చంద్రకాంతులు
మేన చెదరంగా"

పండుగెడ్డము శాంతరసముతో నిండిన నిండుకన్నులు, పలుకులలో కడలి గాంభీర్యము, శరీరమున దివ్యతేజము కలిగి రాజఋషివలె రావిచెట్టు క్రిందను రచ్చబండపై కూర్చున్నాడా చండాలవృద్ధుడు. చెట్లకొమ్మలలో జొచ్చి చంద్రకాంతులు అతని శరీరముపై ప్రసరిస్తున్నాయి.

ఆ ప్రశాంత గంభీరమూర్తి కోటి తపముల పుణ్యఫలమైన తన కుమార్తెను లవణరాజుకు ధర్మపత్నిగా ఇస్తూ అతనితో తన దైనందిన జీవిత వృత్తులనుగూర్చి చెప్పిన మాటలు అతని ప్రశాంత నైతిక జీవితనిష్ఠకు, సంస్కార భావాలకు ప్రతిబింబాలై ప్రకాశిస్తున్నాయి.

"మాలనైనను మలినవృత్తులు
మానుకొంటిని గురువుదయచే;
పొలములోపల పశుల మేపుచు
పొట్ట పోషింతున్"[1]

"మలినవృత్తులు మాన్పి, మాలల
వలస తెచ్చితి యీ వనాంతము
పల్లె కలదిట; ప్రాజ్ఞులందరి
ప్రజలు మా వారల్"

"నేను పుట్టుకచే మాలనైనా మా కులాచారంగా వస్తున్న నీచవృత్తుల్ని ఒక సంస్కృతిపరుడైన గురువు

1. "నీతి పథంబునన్ బ్రతుక నేర్చుట యుత్తమభంగి"—మహాభారతము (విదురనీతి). "చాతుర్వర్ణ్యం మయా సృష్టం గుణకర్మ విభాగశః"—అన్న గీతా వచనాలు ఇందు గోచరిస్తాయి.

దయతో మానివేశాను. పొలములో పశువులను మేపుకుని ప్రశాంత జీవితాన్ని నడుపుతున్నాను—

నావరకే సంతృప్తి పొందకుండా మా జాతివారిని చాలామందిని వారి మలినవృత్తుల్ని మానిపించి, ఇక్కడకు వలస తెచ్చాను. ఈ వనాంతమున మా పల్లె ఉన్నది. ఇందున్న మా వారంతా ప్రాజ్ఞులే.

మాకు పాడిపంటలకు ఏ విధమైన లోటు లేదు. మా పశుసంపదలు తామర తంపరలు. మేము జంతు హింస చేయము. సర్వ భూతములపై దయచూపుతూ జీవించడమే మా మతమని చెప్పాడు.

చిరకాలంనుండి వస్తున్న తనవారి మలిన వృత్తుల్ని మానిపించినా మానసికంగా వారిలో అనుకున్నంత మార్పు రానందుకు విచారించాడు. ఆశావాది కాబట్టి ఆ హరిజన వృద్ధుడు "..... ఓరిమిం జేటికైనను మందు; కలిగిన కలుగు సౌఖ్యంబుల్ — అన్నాడు. (సహనమే సంస్కృతి Toleration is culture).

## ఈ ఖండికపై కొన్ని విమర్శనలు

ఈ ఖండికపై రససంబంధమైన చర్చ ఒక టున్నది. మాతెతలో నాయిక లక్షణాలు లేవని, ఉద్దీపనాదులు స్పష్టంగ లేవని, మతంగకన్య అందానికి ముగ్ధుడై ఆమెను వివాహాము చేసుకోడానికై లవణుడు సమాజాన్ని దూషించడంచేత అతనిలోని భయంకర కాముకత్వం తెల్లపడు

తున్నది గాని అది అతని సంస్కారభావం కాదని ఈ మొద లైన ఆక్షేపణ లున్నాయి. అప్పారావు రససిద్ధాంతాలను దృష్టిలో నుంచుకుని ఈ ఖండికను రచించాడని ఎవరూ చెప్ప లేరు. కాబట్టి ఈ చర్చ అనవసరం. దీనిని వదలివేద్దాం.

## అపర సంధ్యగా మార్పు

అప్పారావు మూలంలోని పూర్వసంధ్యను అపర సంధ్యగా మార్చి, ప్రకృతి వర్ణన చేశాడు. ఇది నాయికా నాయకుల శృంగార రంగానికి అనుకూలంగానే ఉంది. కాని ఒకటిమాత్రం మనము మరచిపోకూడదు. మాలెత తండ్రికి పర్యుషితాన్ని తీసుకుని పోవడం ఆయన మధ్యాహ్న భోజ నానికే, సాయంకాలమున కతడు ఎట్లాగూ ఇల్లు చేరు కుంటాడు. తండ్రికి సాయంకాలమున చలిదిని తీసుకుని పోవడం కాలవిరుద్ధం. కాలము మార్పు ఇక్కడ కుదర లేదు. ఇది అప్పారావుయొక్క కల్పనలోని లోపమని చెప్పక తప్పదు.

## మతంగ కన్యా లవణుల ప్రణయం

మతంగకన్యా లవణుల ప్రణయం, దాని పరిణతి అంతా వారి పూర్వజన్మ వాసనలకు ముడి పెట్టబడింది. ఇది ఇహ లోకంలో ప్రత్యక్షజీవితానికి అంత బలమైన ఉపదేశం కాదు. నాయికా నాయకుల పరస్పరానురాగం ఈ జన్మ లోనే ఉత్పన్నమైనదై ఉంటే అది బలమైన సదుపదేశంగా ఉండేది. అప్పారావుయొక్క వాస్తవిక దృక్పథానికి నివాళు

లెత్తిన ట్లుండేది. జగన్మిథ్యావాదాన్ని త్రోసిపుచ్చి, జీవిత సత్యమే శాశ్వత సత్యమని నమ్మిన ప్రత్యక్ష వేదాంతి ఇటు వంటి స్వప్నవృత్తాంతాలతో, జన్మాంతర అనుబంధాలతో నిండిన ఆద్యకథను ఎందుకు కావ్యవస్తువుగా స్వీకరించాడో అర్థం కావడము లేదు

మన పురాణగాథల్లాగ పూర్వ జన్మలో ఫలానా, ఫలానా వారుగా ఉండి, శాప కారణాలవలన ఆ యా జన్మల్లో ఫలానా, ఫలానా వారుగా పుట్టి దుర్మార్గపు పనులు చేసి, లోక కంటకు లనిపించుకుని శాపవిముక్తికై ఫలానా వారిచేత చనిపోతారు. వారి జీవితాల్లో జరిగే దుర్మార్గంపై మనకు అంత కోపద్వేషాలు కలగవు, ఎందుకంటే ఆ దుర్మా ర్గపు పనులు వారి స్వయంకృతాలు కావు. వారి పూర్వజన్మ సంచితాలు. మంచైనా అంతే. మనము దాన్ని అభినందించ లేము. అప్పారావుయొక్క లవణరాజు కల కూడా ఈ కర్మ సిద్ధాంతాల త్రోవలోనే పయనించిందని చెప్పక తప్పదు. తన ప్రతిభావిశేషాలు, సంస్కారభావాలు అచ్చువడ ఆ యా సందర్భాలు, సన్నివేశాలు ఎంత రమ్యంగా దిద్ది తీర్చినా ఈ పూర్వజన్మ వాసనాగర్భిత ప్రణయాన్ని హేతువాదు లైన రసజ్ఞులు అంతగా అభినందించలేరు.

# పూర్ణమ్మ

గురజాడ పూర్ణమ్మ ఒక కరుణరస ప్రవంతి. దీనిని చదివి కంట తడిపెట్టనివారుండరు. దీనిలో అప్పారావు పరిపూర్ణ మానవత్వాన్ని, సంపూర్ణ సంస్కార దృష్టిని చూడగలము.

కాసుకు లోనై విచక్షణాజ్ఞానాన్ని వీడి, దయావిహీనులై తలిదండ్రులు ముక్కుపచ్చలారని తమ కన్నబిడ్డల్ని ముదుసలి మొగుళ్ళకు ముడిపెట్టడం సర్వసాధారణమైన విషయ మా రోజుల్లో. పూజా పురస్కారాలు గల పూజార్ల కుటుంబాలలోనే ఇటువంటి అఘాయిత్యాలు అడ్డూ ఆపు లేకుండా జరుగుతూ ఉండేవంటే ఇతరమైన వెనుకబడిన జాతుల గురించి వేరే చెప్పాలా? అథమూ శుభమూ తెలియని అమాయకపు పసికన్నలు ఆ మూర్ఖత్వానికి గురై విశాలకాలగర్భంలో కలిసిపోతూ ఉండేవారు. పరమకారుణికోత్తముడు అప్పారావు ఆ దయనీయస్థితిని సంస్కరించడానికి ఈ కథను సృష్టించాడు.

పూర్ణమ్మ కథ మృదుమధురమైన భాషతోనూ, సందర్భోచితమైన చక్కని వర్ణనలతోనూ నడిచింది. పూర్ణమ్మ పాత్ర మన మనోనయనాలకు కట్టినట్లు ఉంటుంది.

చూడండి కావ్యాన్ని ఎంత చక్కగా ప్రారంభించాడో ఈ మహాకవి:—

"మేలిమి బంగరు మొలతల్లారా!
కలవల కన్నుల కన్నెల్లారా!
తల్లులగన్నా పిల్లలారా!
విన్నారమ్మా యీ కథను.

ఆటల పాటల పేటికలారా!
కమ్మనిమాటల కొమ్మల్లారా!
అమ్మలగన్నా అమ్మల్లారా!
వినరమ్మా మీ రీ కథను.

మనము శ్రద్ధాసక్తులతో ఈ కథ వినేటట్లు ఉత్కంఠ కలగజేశాడు. తరువాత—

కొండల నడుమను కోనొకటున్నది
కోనకి నడుమా కోటొకటుంది
........ ...బంగరు దుర్గమ్మ

దుర్గమ్మ ఎక్కడుందో మనకు తెలిసింది. పిమ్మట 'పూజారింట పుట్టెను చిన్నది. పుత్తడి బొమ్మా పూర్ణమ్మ' అన్నాడు. 'ఏ యే వేళల పూసే పువ్వులు ఆ యా వేళల అందించి— ఏ యే ఋతువుల పండే పళ్లను ఆ యా ఋతువుల అందించి...వసంతాగమనాన్ని అంతంత మనోహరంగా వర్ణించి శోభాయమానమైన ప్రకృతిని దర్శింపజేశాడు. ఈ విధమైన ప్రకృతివర్ణనలోనే ఇతనికీ ఆంగ్లకవిశేఖరుడైన వర్డ్సువర్తుకూ గల సంబంధాన్ని చూడగలము.

పువ్వుల మీరిన పోడుములు పూర్ణమ్మకు అంగము లందు అమరాయి. ప్రకృతిశోభకు ప్రతిబింబంలాగ ఉన్న దా బంగారుబొమ్మ. కాని ఆమె ముద్దునవ్వులూ, ముసిపాలూ భర్తను చూచిన నిమిషంలో ముఖకమలంనుండి తొలగాయి. కన్నుల నీళ్లు క్రమ్మాయి. ఆటపాటలలోని తోడిపిల్లలు 'మొగుడు తాత' అని గేలి చేస్తూ ఉండేవారు. ఆటపాటలలో కలియకుండా పూర్ణమ్మ గబగబా దుర్గగుడిలోకి వెళ్లి ఆమె కాళ్లమీద పడి దుఃఖిస్తూ ఉండేది.

మొగుడు తాత పూర్ణమ్మను తీసుకపోవడానికి వచ్చాడు. చీరలు, సొమ్ములు చాలా తెచ్చాడు. సంప్రదాయంగా వది నెలు, చిట్టి మరదళ్లు బంగారు శరీరానికి పసుపు రాసి స్నానం చేయించారు. నేర్పు మీరగ అలంకరించారు. పెద్దలందరికీ ప్రేమతో మ్రొక్కింది పూర్ణమ్మ. సుఖీభవ, దీర్ఘసుమంగళీ భవ, పుత్రపౌత్రాభివృద్ధిరస్తు అని తల్లి దండ్రులు ఆమెను ఆశీర్వదించారు. అర్థంలేని, ఆత్మవంచనతో నిండిన ఆ ఆశీ ర్వాదాలు వింటూ ఫక్కున నవ్వింది పూర్ణమ్మ. ఆ నవ్వే పాఠకలోకాన్ని కరుణాసముద్రంలో ముంచివేస్తుంది.

నవనీత కోమలహృదయ పూర్ణమ్మ తనకంటె చిన్న వారిని కౌగిట చేర్చుకుని కంట తడిపెట్టుకుంటూ అన్నదమ్ము లతో అన్నమాటలు చూడండి—ఎంత కటికిరాతికైనా కూడా కరిగించి వేస్తాయి.

తన జీవితాన్ని నాశనం చేసిన మూర్ఖులైన అమ్మనూ, అయ్యనూ కానండి! అంటుంది. తను ఏలాగైతే ఆయా వేళల

పూచే పూవులతో ఆ యా ఋతువుల్లో పండే పళ్ళతో దుర్గను పూజిస్తూ ఉండేదో ఆ విధంగానే అమ్మల గన్న అమ్మనూ దుర్గమ్మనూ పూజింపుడని కోరుతుంది.

నలుగురు కూచుని నవ్వేవేళల తన పేరొక పర్యాయము తలచమన్నది. తన్ను మరిచిపోకుండా ఉండడానికి వారి వారి కన్నబిడ్డల్లో ఒక తెకు ప్రేమతో తన పేరు పెట్టమన్నది.

పూర్ణమ్మయొక్క దయనీయమైన అమాయకపు ముద్దుమాటల్లో గంభీరార్థాలు ప్రజ్వరిల్లుతున్నాయి. కన్నులు తుడుచుకొంటూ ఆమె కలకల నవ్వింది. వదినెలూ, తమ్ములూ ఆమె స్థితిని అర్థం చేసుకొని చాలా విచారించారు. కన్నతల్లికి జ్ఞానోదయ మయింది. కడుపు కరిగింది. కంట తడిపెట్టింది. అంతా అయిపోయింది. ఇంకేం ప్రయోజనం? పాఠకలోకం మాత్రం ఇంట్లో ఉన్న వారందరికంటె ఎక్కువగా దుఃఖిస్తూఉంది.

తాను తిరిగి ఇంటికి రాదు. ఏ విధంగా చూచినా తన జీవితానికి ప్రయోజనం లేని ఈ కఠిన లోకాన్ని కొద్ది సేపట్లో విడిచిపెట్టిపోతూఉంది. ఆ నిశ్చయానికి తిరుగు లేదు. అటువంటప్పుడు ఆమె కెందుకో ఇంటిలో ఉన్న వాళ్ల గురించి అంత ఉబలాట! ఆ ఉపదేశాలూ, ఆ కోరికలూ ఎందుకు?

పూర్ణమ్మ మన స్తత్త్వాన్ని చిత్రించడంలో అప్పరాయ కవీంద్రుడు చూపిన ప్రతిభా విశేషాలూ, నేర్పూ వర్ణనాతీతాలు. సహజ సుందరరీతులలో మనో వైఖరుల గమన

రీతులను చూపుటలో తిక్కనకు సాటియైన మహాకవి ఆంధ్ర సారస్వతలోకంలో 'అప్పరావే' అని చెప్పవలసి ఉంటుంది.

చూడండీ ఈ పద్యాలు ఎంత కోమలపద విలసితాలో!

"ఎప్పటి యట్టుల సాయంత్రమ్మున
వరిన పువ్వులు సరికూర్చి
సంతోషంబున దరను కొలువను
ఒంటిగ పోయెను పూర్ణమ్మ.

[1] "ఆవులు పెయ్యలు మందల జేరెను
పిట్టలు చెట్లను గుమి గూడెన్
మింటను చుక్కలు మెరయుచు పొడమెను
ఇంటికి పూర్ణమ రాదాయె.

1. నన్నయ భారతం ఆదిపర్వంలో కచుడు సాయంకాలమరుసరికి ఇంటికి రాకపోవడానికి విచారిస్తూ దేవయాని తండ్రితో అన్నమాటలు —

"వాడి మయూఖముల్ గలుగువాఁ డపరాంబుధిఁ
గ్రుంకె ధేనువుల్
నే డిట వచ్చె నేకతమ నిష్ఠ మెయిన్ భవదగ్ని
హోత్రముల్
పోడిమి వేల్వఁగాఁ బడియెఁ బ్రొద్దును బోయెఁ
గచుండు నేనియున్
రాడు వనంబులోన మృగరాక్షస పన్నగ బాధ
నొందెనో"

వర్డ్సువర్తు లూసీ గ్రే లోని "And many a hill did Lucy climb; But never reached the tower" అన్న మాటలు ఇచ్చట జ్ఞప్తికి వస్తాయి.

పూర్ణమ్మ దయాదాక్షిణ్యాలు లేని ఈ మూర్ఖపు లోకంనుండి మాయమైపోయింది. అత్తగారింటికి వెళ్ళడానికి బదులు అమ్మలగన్నఅమ్మ దుర్గమ్మ యింటికే వెళ్ళిపోయింది. పాంచభౌతికమైన ఈ ప్రకృతినుండి స్వీకరించిన సౌందర్యాన్నంతా ఆ ప్రకృతికే ఇచ్చివేసింది. ఆమె అనంతవిశ్వంలో అదృశ్యమైపోయింది. అంతా శూన్యమయింది.

[1] "కన్నుల కాంతులు కలువల చేరెను
మేలిమి జేరెను మేని పసల్
హంసల జేరెను నడకల బెడగులు
దుర్గను జేరెను పూర్ణమ్మ"[2]

ఆమె కన్నుల కాంతులు కలవపూలను చేరాయి. ఆమె దేహ సౌందర్యం అపరంజిని చేరింది. ఆమె నడకల

1. Full fatham five thy father dies
of his bons are coral made
These are peals that were his eyes,
Nothing of him that doth fade
But doth suffer a sea-charge
Into something rich ano strange.
—The Tempest (Shakespeare)

2. "కల మన్యభృతాసు భాషితం
కలహంసీషు మదాలసం గతం,
పృషతీషు విలోల మీక్షితం
పవనాధూత లతాసు విభ్రమః"—అజవిలాపము,
(కాళిదాసు మహాకవి)

సొగసులు హంసలను చేరాయి. ఆమె మూర్తి దుర్గలో లీనమై పోయింది.

ఈ వర్ణన అత్యంత మనోహరం. డా॥ సి. నారాయణ రెడ్డిగారు చెప్పినట్లు షేక్స్పియరు 'The Tempest' నాటకములోని Ariel పాడిన పాటలోనూ, కాళిదాసుని రఘువంశ కావ్యములోని అజవిలాప ఘట్టములోనూ ఈ చరణాల్లోని భావాలు స్ఫురణకు వస్తాయి.

కాళిదాసుని కుమారసంభవములో పార్వతి తపస్సు చేయడానికి వెళ్ళేటప్పుడు మళ్ళీ వచ్చి తీసుకోడానికై తన శరీర లాలిత్యాన్ని తీగలందును, చంచల దృష్టులు ఆడలేళ్ల యందును దాచుకున్నదట. ఈ శ్లోకం కూడా ఇక్కడ స్మరణకు వస్తుంది.[1]

1. పునర్గ్రహీతుం నియమస్థయా తయా
ద్వయేఽపి నిక్షేప ఇవార్పితం ద్వయం,
లతాసు తన్వీషు విలాస చేష్టితం
విలోల దృష్టిం హరిణాంగనాసు చ.
—కుమారసంభవము, (కాళిదాసు.)

# కన్యాక

కన్యాక జరిగిన కథ. అప్పారావు దీనిని కూడా తన సంఘసంస్కరణ ప్రయోజనానికి సొంతం చేసుకున్నాడు. విషాదాంతం చేసి రాజుల దుర్మార్గ ప్రవర్తనమీద ధ్వజ మెత్తాడు. ఇందులో రాజుయొక్క దుర్మార్గప్రవర్తనను, దురహంకారాన్ని అప్పారావు చక్కగా చూపించాడు. కన్యాక తన మానాన్ని రక్షించుకోడానికి మంటలో పడ్డం కూడా అత్యంత మనోహరంగా చిత్రింపబడింది.

జమీందార్ల దగ్గర ఉద్యోగం చేయడంచేతను, వాళ్ళతో కలసి మెలసి తిరగడంమూలాన అప్పారావుకు వారి అవలక్షణాలన్నీ బాగా తెలుసును. చాలామంది జమీందారులూ, పెద్ద భూస్వాములూ ఆ రోజుల్లో రసికత పేరుతో ధనకనక వస్తువాహానాదులు ఉపయోగిస్తూ, అధికారాన్ని చెలాయిస్తూ అనేక దుర్మార్గపు పనులు చేస్తూ ఉండే వారు. పట్టణాలలోనూ, పల్లెల్లోనూ అందమైన స్త్రీ ఉండడమే మహాపాపం. వాళ్ల దృష్టిపథంలో ఏ స్త్రీ యైనా పడిందనుకోండి, ఆమె కన్య కానీయండీ, కులకాంత కానివ్వండీ వారి కామానలానికి ఆహుతి కావలసిందే.

అవినీతికరమైన ఈ స్త్రీలోలత్వం కన్యాకను చెరబెట్ట దలచిన వేంగీ చాళుక్యరాజుల కాలంలోనే కాదు;[1] తరువాత

---

1. ఈ కన్యాకను చెరపెట్ట తలంచిన వేంగీ చాళుక్యరాజు కథ పుక్కిటి పురాణమని చాలమంది చరిత్రపరిశోధకులు చెప్పుతున్నారు. దీనినిగూర్చి సత్యాన్వేషణ చేయవలసి ఉంది.

రాయలకాలంలో కూడా రసికత పేరుతో ఇది రాజరిక వ్యవస్థలో అమలు జరుగుతూ వచ్చింది. బహు భార్యాత్వంతో సంతృప్తి పొందక వారు ఉంపుడుకత్తెలను కూడా పెట్టుకొని ఉండేవారు. ఈ స్త్రీభోగం ప్రవృత్తి భోగాల్లో ఒకటని ఆ నాటి కవిపండితులు ఈ దుష్టవ్యవస్థకు పట్టాభిషేకం చేయడమే కాకుండా ఈనాటి పండితులు కూడా కొంతమంది తెగ పొగడుతున్నారు.

సిరి గలవానికిఁ జెల్లును
దరుణులఁబదియాఱువేలఁ దగఁ బెండ్లాడన్
దిరిపెమున కిద్దరాండ్రా
పరమేశా, గంగ విడుము; పార్వతి చాలున్!

అన్న పద్యం దీనిని సమర్థించడానికి పుట్టిన పద్యమేమో అనిపిస్తుంది.

పర రాజుల్ని ఓడించడం, వాళ్ల కన్నెల్ని, స్త్రీలను చెరపెట్టడం, వారిని బలవంతంగా భార్యల్ని చేసుకోవడం ఆ నాటిరాజుల ప్రవృత్తి భోగాల్లో ఒకటని మనం తెలుసుకోవాలి.[1]

1. మనుచరిత్రలో ప్రథమ తృతీయాశ్వాసాంత పద్యాలు చూడండి:

ఉత్సాహ. ఖచర ఖశ కురు కరూశ కోసలాంధ్ర సింధు బా
హ్లిక శకాంగ వంగ సింహళేశ కన్యకామణీ
ప్రకరపాణి ఘటిత రత్న పాదుకా కలాచికా
ముకుర పీఠికా కరండ ముఖ్య రాజ లాంఛనా:

ఖచర ఖశాదిదేశాల రాజుల నోడించి తీసుకవచ్చిన వారి కన్నెలు

ఈ ప్రవృత్తి భోగాలు నాయకరాజుల కాలంలో, ముఖ్యంగా విజయరాఘవనాయకుని కాలంలో పరాకాష్ఠ నందుకున్నాయి. ఆ నాటి సాహిత్యమంతా ఇదే.

దేవుని పూజించి రావడానికి చెలికత్తెలతో సహా నడివీధిలో వెళుతున్న సౌందర్యతిలక, కుసుమకోమలి కుసుమసెట్టి కూతురు కన్నెను రాజు చూచాడు. "కన్నె సొగసుకు కన్ను చెదరై మరుని వాడికి గుండె బెదురై" అతడీవిధంగా తలపోశాడు.

"ఔర! చుక్కల మధ్య చంద్రునిలాగ వెలుగుతూ ఉన్న ఈ కన్నెముందర సౌందర్యవతులైన నగర సుందరులెందుకూ పనికి రారు. ఈమెను బలాత్కారంగానైనా పట్టాలి. రసికలోకంలో గండపెండేరం వేసుకోవాలి" అనుకున్నాడు. ఇదీ వీని రసికత. దుష్టమంత్రుల సహాయంతో ఆ దుష్టబుద్ధి నిర్భయంగా పెండెం గట్టి, కన్నెను చుట్టి పట్టనెంకించాడు. కన్యక అత్యంత భయంతో దైవగతికి మన

---

తమ్ముపడిగము, పావుకోళ్లు మొదలైనవాటిని పట్టి నిల్చుండగా రాజలాంఛనాలతో ఒప్పిన కృష్ణదేవరాయా! అని తాత్పర్యం.

"హిందూ రాజ్య రమా ధురంధర.........
.....................................
..................కళింగాంగనా
బందీగ్రాహ విగాహితోత్తర కకుద్ధాటీ సమాటీకసా॥

ఉత్తరదేశాలపై దండెత్తి, కళింగ రాజ్యాన్ని జయించి, వారి స్త్రీలను చెరపెట్టి తెచ్చిన కృష్ణరాయా! అని పెద్దన్న పొగడాడు.

స్సులో దుఃఖించి, దిక్కు లేనివారికి దేవుడే దిక్కని దిట్టతనమును బూని రాజుతో ఈ విధంగా పలికింది :

“నన్ను తాకవద్దు. నేను దేవకార్యం తీర్చి వస్తాను. నీవు ఈ పట్టణాన్ని ఏలే రాజువు. నేను సెట్టికూతుర్ని. నిన్ను తప్పించుకొని ఎక్కడికి వెళ్లగలను!” అని వినయంతో, మృదువుగా చెప్పింది. చుట్టాలు, సేవకులతో చుట్టి ఉన్న సెట్టి — కన్యక తండ్రి — కూడా చెప్పరానంత భయంతో చేతులు జోడించి వినయవిధేయతలు అగుపడ ఈ విధంగా విన్నవించాడు.

“పట్టణమేలే రాజా! నీవు నా కుమార్తెను బలవంతంగా పట్టాలా? ఈమె నీ సొమ్మే కదా! నీ యంతవాడు కోరుటకంటె మా వైశ్యజాతికి ఇంకేమివన్నె కావాలి! కాని మన్నన చేసి మమ్ములను బంధువర్గం. కులం పెద్దల ధర్మమన్నది అరసి సంప్రదాయంగా, అగ్నిసాక్షిగా కన్నెను గైకొని, వలసినన్ని కానుకల నందుకొని మమ్మల్ని మా జాతిని ఆదరింప వేడుతున్నాను.”

సెట్టి మాటలకు ఆ పొగరుబోతు రాజు హేళన నవ్వు నవ్వి—

“ఓహో! ధర్మమార్గం
పట్టమేలే రాచబిడ్డకు
సెట్టి కరపడమా!”

''రాజు తలచిందేను ధర్మం
రాజు చెప్పిందెల్ల శాస్త్రం
రాజులకు పేరైన పద్ధతి
కాద, గాంధర్వం''[1]

''తడవు చెయ్యక తల్లడిల్లక
నేడు రేపని గడువు పెట్టక
నమ్మి గోరితివేని కన్నియ నిమ్ము!
లేకుంటే పొమ్ము!

''డేగ, పిట్టను పట్టి విడుచున?
కన్నె, యింటికి మరలి నడుచున?
తెమ్ము కానుక లిమ్ము నీ విట
వచ్చి నందాక

కదల'' నంతట సెట్టి పలికెను,
''దేవకార్యం ముందు, అవల
రాచకార్యం కాద రాజా!
శలవు నీ విస్తే
యింటి దైవం వీరభద్రుడి
దేవళానికి పోయి యిప్పుడె
క్షౌరం సాగించి వతును
[illegible] తమ చిత్తం!''

1. మృచ్ఛకటిక నాటకంలో పొగరుబోతు రాజస్యాలకుడు ప్రేలినట్లే ప్రేలాడీ దుర్మార్గుడు కూడా. ఇక్కడ గాంధర్వమా, రాక్షసమా ఏ వివాహము చేసుకో దలచాడు వీడు?

"మంచిదే మరి నడువు, మేమును
తోడ వత్తుము దేవళంలో
అగ్నిసాక్షిగ కన్యకను మే
మందు కొనగలము"

ఈ విధంగా దుర్మార్గుని బారినుండి తప్పించుకోలేక పోయారు. డేగ పిట్టను వదలనట్టు ఆ దుష్టుడు కన్యకను వదలలేదు.

## కన్యక విప్లవాత్మక సందేశం

ఆనాడు వీరభద్రుని దేవాలయంలో ఆకాశాన్ని అంటే మంటలతో గుండం ప్రజ్వరిల్లింది. ఆ మంటలను చూడగనే రాజు గుండె దిగులై పట్టు విడజొచ్చింది. ధర్మస్వరూపిణి, ధైర్యసాహసోపేత కన్యక భక్తిపరవశమైన మనస్సుతో దుర్గను సేవించి, ముక్తిని వేడుతూ ఆభరణాల నన్నీ వూడ్చి దేవికే అర్పించింది. కొలనిలో స్నానం చేసింది. తరువాత రక్తగంధం రక్తమాల్యం దాల్చి ఆదిశక్తిలాగ అగుపించింది. గుండం చుట్టు నిల్చున్న బంధుజనుల నుద్దేశించి గంభీర స్వరంతో ఈ విధంగా పలికింది:

"అన్నలారా! తంమ్రులారా! ఒక్క విన్నపాన్ని ఆలకించండి. మీ కులములోపల ఆడుబిడ్డల్ని కాపాడుకోడానికి మీకు ఆశ లేదా? ఈతడు పట్టమేలే రాజు అయితే వీని గెలిన దేవుడు లేడా? దైవాన్నూ, ధైర్య సాహసాలతో మీరు ముందుకు రావాలి. పరువు నిల్పుకోడానికి మీకు పౌరుష మెందుకు కలుగదో?

ఎవడు విద్య నేర్చునో వాడే విప్రుడు. వీర్యము ఎవని కుండునో వాడే క్షత్రియుడు అని పెద్దలు వారివారి గుణాలను బట్టి కర్మలనుబట్టి జాతుల్ని విభజించారు. ఈ ధర్మపద్ధతిని మరచి, గౌరవస్థానాలకు ఆశ చేయకుండా డబ్బు ఉంటే చాలు ననుకొని వీర్య మెరుగక విద్య నేర్వక బుద్ధి మాలినచో కష్టాలకు గురి అవుతారు. ఇప్పటికైనా మించిపోలేదు. మేల్కొని మీరంతా బుద్ధి బలాన్ని, భావబలాన్ని పెంచు కొని, ఆత్మశక్తిని ఆధారంగా చేసుకొని, దైవమూపై భార ముంచి రాజులలో రాజులరై మనండి!'' అని తీక్ష్ణవాక్కు లతో ఉపన్యసించి, రాజు కెదురై నాలుగడుగులు ముందుకు నడిచి ఈ విధంగా పలికింది :

రాజు ప్రజలను కన్నబిడ్డల్లాగ కాపాడాలి. సమా జంలో శాంతిభద్రతలు నెలకొల్పాలి. అది అతని ధర్మం. అటువంటి బాధ్యతలు గల రాజే జార చోరులకంటె నికృష్టుడై అడ్డూ ఆపు లేకుండా దుర్మార్గవృత్తికి, దౌర్జన్యా నికి దిగినప్పుడు సమాజ మేమౌతుంది? దేవాలయానికి దేవ కార్యం తీర్చడానికి చెలికత్తెలతో సహా నడివీధిని వెళుతున్న ఆడదాన్ని పట్టపగలే కట్టవేసి చెరపట్ట తలంచినవాడు పట్టి మేలే రాజెలా గౌతాడు?

కండకావర మెక్కి నీవు తలపెట్టిన ఈ దుండగానికి దైవమంటూ ఒక డుండడా? ఆ దైవము ఉదాసీనంగా ఉంటాడా?

ఇదిగో మా కులం పెద్దలందరూ కూడి ఉన్నారు. అగ్నిసాక్షికి అదిగో ఆ గుండంలో అగ్ని ప్రజ్వరిల్లుతూ ఉన్నది. నీ కన్ను కోరిన కన్నె ఇదుగో ఇచ్చటనే ఉన్నది. ఇంకెందుకు ఆలస్యం చేస్తావు? రా! పట్టుకో! అని రౌద్ర స్వరూపిణి యైన కన్యక మానసంరక్షణార్థం చుట్టుముట్టిన మంటలో పడి, ప్రాణత్యాగం చేసి, ఒక ఉజ్జ్వలాదర్శాన్ని స్థాపించింది. చివర కా రాజుకు పట్టిన గతి చూడండి!

"పట్టమేలే రాజు గర్వం
మట్టి గలిసెను, కోట పేటలు
కూలి, నక్కల కాటపట్టై
అమరె

ఒక్కడై తే కన్యమానం
కాచుకొనుటకు మంట గలిసెనొ,
అక్కడొక్కటి లేచె సౌధము
ఆకసము పొడుగై.

పట్ట మేలే రాజు పోయెను
మట్టి కలిసెను కోట పేటలు
పదం పద్యం పట్టి నిలిచెను
కీర్తు లపకీర్తుల్"

'ఉపదేశయుజే' అన్న ఆలంకారికుల కావ్యప్రయోజనం అప్పారావు యొక్క కన్యకలో అక్షరాలా కానవస్తుంది.

బీదప్రజానీకాన్ని ఆదుకోమని వేమన్న ధనవంతుల్ని కోరాడు. వేమన్న బోధలు ధనవంతుల చెవుల కెక్కలేదు. ఆవేశపూరితుడు, అగ్గిరాముడు వేమన్న. అతని హృదయంలో ఉదాసీనతకు చోటు లేదు. కోపాన్ని ఆపుకోలేక —

"ఆకలి గొని వచ్చినను పర దేశికి
పట్టె డన్నమైన పెట్టబోడు
లంజదాని కొడుకు లంజల కిచ్చురా"

అని ధనమదాంధుల నిర్దాక్షిణ్యప్రవృత్తిని నిర్భయంగా ఎత్తి చూపాడు. ఈ తిట్టులో వారి వ్యభిచారజీవితాన్ని కూడా తాకినాడాడు.

వేమన్నభాషలోని తీవ్రత అప్పారావు కథల్లో కనిపిస్తుంది. ఇద్దరూ ధనికతత్వాన్ని ఎదిరించినవారే. శాంతిభద్రతలతో కూడిన ఉత్తమ సమాజ నిర్మాణానికి జమీందార్లయొక్కయు, భూస్వాములయొక్కయు, దుర్మార్గపు చర్యలు, కామసుఖాలు పరమాశత్రువులై యున్నాయి. 'కన్యక' లోనే కాకుండా 'నవల - సన్నివేశాలు' అనే పేరున వ్రాసి పెట్టుకున్న ఇతని అసంపూర్ణ రచనలోకూడా ఒక జమీందారు 'సౌదామిని' అనే కన్యను నీలగిరి కొండలపైకి లేవనెత్తుకొనిపోయిన ఆగడాన్ని వర్ణించాడు. ఈ ఆగడాన్ని - అరాచకాన్ని - మృగత్వాన్ని అరికట్టడమే అప్పారావు యొక్క ఆశయము. ఈ ఆశయసిద్ధికై ఇటువంటి ఆద్య కథల్ని ఆయుధాలుగా తీసుకున్నాడు.

# మనిషి

గురజాడ 'మనిషి' అనే చిన్న గేయం మూర్తిపూజపై మాధవమ్మాకాలపై ఒక బ్రహ్మాస్త్రంలాంటిది.

మానవుడు తన విచక్షణాదృష్టివలన, వివేచనాశక్తిచేత, మానవత్వంవలన క్రమంగా మృగజీవితంనుండి వేరై జ్ఞానమూరియై వెలుగొందాడు. పిమ్మట అతడు పాంచభౌతికమైన ఈ జగత్తునుగురించి, తాను అనుభవిస్తున్న కష్టసుఖాలనుగురించి, జనన మరణాదులను గురించి అత్యంత తీవ్రంగా ఆలోచించ మొదలుపెట్టాడు. అప్పుడతడు మొదలుపెట్టిన ఆలోచన ఇప్పటికీ ఇంకా కొనసాగుతునే ఉంది. దీని కంతం లేదు.

మానవుని శక్తికి అతీతమైనదీ, అతని ఊహాల కందనిదీ ఐన ఒక మహత్తర శక్తి ఈ ప్రపంచాన్ని నడిపిస్తూ ఉందనీ, వెనుకటి జన్మలో మానవుడు చేసిన కర్మే ఈ జన్మలో అతని సుఖదుఃఖాలకు కారణమనీ, దేహం నశిస్తుంది గాని ఆత్మకు చావులేదనీ చెప్పే తాత్త్వికసిద్ధాంతం ఒకటి మానవుని ఆలోచననుండి ఉద్భవించింది. దీన్నే ఆస్తికవాద (Theism) మంటారు. ఈ తాత్త్వికసిద్ధాంతం వివిధ రూపాలతో విభిన్నశాఖలతో విశ్వవ్యాప్తి గాంచింది.

ఈ సిద్ధాంతానికి పూర్తిగా వ్యతిరేకమైన తాత్త్విక సిద్ధాంతం కూడా ఒకటి మానవుని మస్తిష్కమునుండి

వెలువడింది. దీనిని నాస్తికవాద (Athism) మంటారు. ఈ తత్త్వం కూడా అనేకశాఖోపశాఖలతో మానవలోకాన వ్యాపించి ఉంది. ఈ రెంటికీ కావలసినంత తార్కికసంపద ఉంది. రెండువైపులా వాదించే మహానుభావులు, మేధావులు ఎందరో ఉన్నారు.

ఈ రెండు తాత్త్వికసిద్ధాంతాలు ఇలా ఉండగా వీటిని సమన్వయపరచే మధ్యమమార్గాన్నొకదాన్ని మానవుడు కనుగొన్నాడు. ఈ తత్త్వధోరణిలో మానవుని శక్తికీ, అతని కారణ విమర్శనకూ, శీలసంపదకూ, మానవత్వానికీ, బాధ్యతాయుత జీవితానికీ ప్రాధాన్య మీయబడింది. దేవుడు ఉన్నాడా? లేడా? అనే వాదనను ఈ తాత్త్వికసిద్ధాంతం పట్టించుకోదు.

ప్రస్తుతం వీటిని గూర్చి సుదీర్ఘచర్చ మన కనవసరం. ఇక అసలు విషయానికి వద్దాం.

అప్పారావు బ్రహ్మసమాజభావచ్ఛాయల్లో మెలగినా, దివ్యజ్ఞానసమాజ సంస్కారాలపై అభిమానం చూపించినా ఇతనికి సొంత అభిప్రాయాలు కొన్ని ఉన్నాయి. మొదటనే నేను చెప్పినట్లు విభిన్న జీవితవిధానాల్లోని—వివిధ తాత్త్వికసిద్ధాంతాల్లోని మంచితనాన్ని ఇతర భావాల్లో చూడగలము' ఇతడు సమన్వయవాది. ఇతని తాత్త్వికధోరణి శాస్త్రదృష్టితో నిండిన మానవతావాదం.

"మానవుడు సర్వశక్తిసంపన్నుడు. తన సుఖదుఃఖాలకు, తన భావికి తానే కర్త. దేవు డనేవాడు ఒకడుండినా

అతడు కర్మసాక్షిమాత్రం. మానవుని కర్మతో అతని కేమీ సంబంధం లేదు. అతడు సర్వాంతర్యామి. అతడు లేని చోటే లేదు. సమస్త జీవుల్లో ఉన్నాడు. ప్రతి మానవునిలో ఉన్నాడు. జీవకోటినీ, మానవసమాజాన్నీ ప్రేమించు నీ చుట్టు ఉన్న మానవుల కష్టసుఖాల్లో భాగస్వామివి కమ్ము. వారి కష్టాలను తొలగించడానికి కృషి చేయి. ప్రాణికోటి సేవే పరమాత్ముని సేవ. మానవసేవే మాధవసేవ. ఈ సేవలోనే నీవు పరిపూర్ణానందాన్ని పొందుతావు. అదే నీ శాంతియుతజీవితానికి సాధన మౌతుంది'' అనే సందేశాన్ని అప్పారావు తన కవిత్వంద్వారా చాటి చెప్పాడు.

మనిషి చేసిన రాయి రప్పకి
మహిమ కలదని సాగి మ్రొక్కుతు
మనుషు లంటే రాయిరప్పల
కన్న కనిష్టం
గాను చూస్తా వేల బేలా?
దేవు డెకడో దాగె నంటూ
కొండ కోనల వెతుకులాడే
వేలా?
కన్ను తెరిచిన కానబడడో?
మనిషి మాత్రుడియందు లేడో?
యెరిగి కోరిన కరిగి యీడో
ముక్తి!

మనుష్యుడు భయంతో అజ్ఞానంతో రకరకాల రాతి బొమ్మల్ని చేసి ఒకచోట పెట్టి, వాటికి దేవుళ్ల పేర్లు పెట్టు తున్నాడు. వాటికి మహిమ కలదని భయపడుతూ నీవు సాగి మ్రొక్కుతున్నావు; చెంపలు వాయించుకుంటున్నావు. ఇంత కంటే అజ్ఞానముందా! తోడి మానవులను మాత్రం రాయి రప్పలకన్న హీనంగా చూస్తున్నావు. ఇంతకంటే తెలివి తక్కువతన ముందా!

దేవు డెక్కడో దాగెనంటూ సింహాద్రి అప్పన్న, తిరు పతి, శ్రీశైలాది కొండలమీదా కోనల్లోనూ వెతుకులాడే దెందుకు! నీకన్ను తెరిచి చూడు. మానవునిలోనే దేవుడు కనిపిస్తాడు. మానవత్వంతో నిండిన పరిపూర్ణ హృదయంతో జ్ఞానభక్తి కల్గి దేవుని పూజించు. నీవు నిజమైన ముక్తిని పొందుతావు. అని అప్పారావు మహోన్నతమైన మానవతా వాద సందేశాన్ని మానవలోకాని కందించాడు.

ఈ ధోరణిలోనే అప్పన్నఅన్న వేమన్న ఏమన్నాడో అతని నిక్కమైన చక్కని నీలాలను ఇక్కడ కొన్ని చూపిస్తాను.

"శివుఁడు గలఁడటంచు శిలలకు మ్రొక్కెడి
వెఱ్ఱి జీవులార! వెతలు విడుడి
జీవులందెఁ గాక శిలల నే మున్నది?"

"తోలు కడుపులోన దొడ్డవాఁ డుండంగ
రాతి గుళ్లలోన రాశి బోయ
రాళ్లు దేవుఁడైన రాసులు మ్రింగవా!"

"రాతి బసవని గని రంగుగా మ్రొక్కెదు
గుడుకు బసవని గని గ్రుద్దుచుంద్రు
బసవభక్తులెల్ల పాపులు తలపోయ"

ఈ విధంగా ప్రశ్నించాడీ ప్రగతివాది.

అప్పారావు గేయానికి రవీంద్రనాథ ఠాగూరు 'గీతాంజలి' లోని ఒక గేయానికీ భావతుల్యత స్పష్టంగా కనిపిస్తుందనీ, ఇద్దరిలో ఎవరో ఒకరు మరొకర్ని అనుకరించారేమో అన్నంత సమానధర్మ మున్నదనీ డా॥ సి. నారాయణరెడ్డి గారు తన గ్రంథంలో వ్రాశారు. వారే గురజాడ గేయం రవీంద్రుని 'గీతాంజలి' (ఇంగ్లీషు) వెలువడక ముందే రచింపబడిందని కూడా చెప్పారు. రవీంద్రుని 'గీతాంజలి' లోని గీతారాజ మిది :

Leave this chanting and singing and telling of beads; whom dost thou worship in this lonely dark corner of a temple with doors all shut? Open thine eyes and see thy God is not before thee!

He is there where the tiller is tilling the hard ground and where the pathmaker is breaking stones. He is with them in sun and in shower, and his garment is covered with dust. Put off thy holy mantle and even like him come down on the dusty soil!

Deliverance? Where is this deliverance to be found? Our master himself has joyfully taken upon him the bonds of creation; he is bound with us all for ever.

Come out of thy meditations and leave aside thy flowers and insense! What harm is there if thy clothes become tatterd and stained. Meet him and stand by him in toil and in sweat of thy brow.

ఈ భజనలూ, ఈ జపమాల పూసలు లెక్కించడం విడిచిపెట్టు. తలుపులన్నీ మూయబడి మనుష్యసంచారం లేని ఈ చీకటి గుడిలో ఒక మూల కూర్చొని ఏ దేవుని పూజిస్తున్నావు? నీ కండ్లు తెరిచి చూడు; నీవు ప్రార్థిస్తున్న దేవుడు నీ ముందు లేడు.

అదిగో చూడు, కఠిన ధరాతలంలో హాలికు లెక్కడ దున్నుతున్నారో, బాటలను నిర్మించడానికై శ్రామికు లెక్కడ శిలలను పగులగొట్టుతున్నారో అక్కడే నీ దేవు డుంటాడు; మండుటెండలో, వాన జల్లులో వారి కండగా ఉంటాడు. అందుచేతనే ఆ శ్రమజీవి దుస్తులు మురికితో నిండాయి. నీ శుభ్రపరిధానాన్ని విడిచి ఆ శ్రమజీవివలె ధూళితో నిండిన ధరాతలానికి రా!

మోక్షము! ఎక్కడ దొరుకుతుందా మోక్షము? సృష్టికర్త సృష్టిబంధాల భారాన్ని అత్యంతానందంతో స్వీకరించిన ప్రభువా—వాటితోడనే మనల్ని తనతో శాశ్వతంగా బంధించాడు. ధ్యానంనుండి బయటకు రా! నీ పూజా ద్రవ్యాలు (పుష్ప ధూపాదులు) ఒక ప్రక్కకు పెట్టు. నీ దుస్తులు మురికైతే నేమి? చినిగిపోతే నేమి? వాటివలన నీకేమి నష్టం? శ్రమజనిత స్వేదజలం నీ నొసటనుండి జార ఆ శ్రమజీవిని కలుసుకో. వెళ్ళు, అతని ప్రక్క నిలవడు.

వేమన ఎప్పుడో చెప్పాడు ఈ శ్రమజీవిధర్మాన్ని—
''భూమిలోన పుట్టు భూసారమెల్లను
తనువులోన పుట్టు తత్త్వమెల్ల
శ్రమములోనఁ బుట్టు సర్వంబు తానౌను॥ విశ్వ॥
అని మూడు చరణాలలో అంతా చెప్పాడు.

అదృష్టాలంటూ, పూర్వజన్మకర్మలంటూ పూజాపునస్కారాలతో, జపతపాలతో కాలం గడుపుతూ ఆత్మశక్తిని పూర్తిగా విస్మరించి. శ్రమజీవితాన్ని వదలి అంతటికి దైవశక్తే అంటూ, సోమరితనాన్ని పెంపొందజేసుకుంటూ ఉన్న భక్తలోకంయొక్క బుద్ధి జాడ్యంమీద రామబాణంలాంటిది రవీంద్రుని గీతారాజం. ఈ గేయంలోని 'శ్రమజీవన ధర్మం' మానవతావాదానికి ఒక మెట్టెక్కువ అని చెప్పాలి.

అప్పారావు రవీంద్రునివలె ఇంత దీర్ఘంగా, ఆధ్యాత్మిక ధోరణిలో తన భావాలు చెప్పలేదు. ఇతడు సూటిగా సంగ్రహంగా స్పష్టంగా కొండల్లాంటి విషయాలను చిన్న మూడు గేయాల్లో చెప్పాడు. ఇందులోనే వీరి భేదం కానవస్తుంది.

డా॥ సి. నారాయణరెడ్డిగారు చెప్పినట్లు అప్పారాయ రవీంద్రులలో కొన్ని ధర్మసామ్యాలు కూడా లేకపోలేదు. అవి వారి కావ్యరచనా విధానాలలో, దేశభక్తిలో, మానవతావాదంలో అంధవిశ్వాసాల నెదిరించడంలో కనిపిస్తాయి. రవీంద్రుని వ్యక్తిత్వము అప్పారావు నాకర్షించిందన్న మాటలో కూడా సత్యమున్నది. కాని వీరి ప్రధాన దృక్పథాలలో మాత్రము పోలికలు లేవు.

రవీంద్రుడు సౌందర్యోపాసకుడైన ప్రణయకవి; మర్మ కవి[1] కూడా. ఈతనిది ఆధ్యాత్మికధోరణి. అప్పారావు సంస్కారభావుడైన ప్రజాకవి, ఈతడు జీవితసత్యమే పరమ సత్యమని నమ్మిన ప్రత్యక్ష వేదాంతి. ఇతని కవిత్వంలో, భావాలలో అస్పష్టతకు చోటులేదు.

రవీంద్రుడు భారతీయ సంస్కృతి అనే పేరుతో పాత దాన్నే క్రొత్తరూపంలో చూపిస్తాడు.

అప్పారావు పాతదానిలోని మంచిని గ్రహించి వానికి సరిక్రొత్తతనాన్ని పొదుగుతాడు.

రవీంద్రుడు గొప్ప మనస్తత్వశాస్త్ర పరిశోధకుడైన మహాకవి. అయితే ఈతని తరగతి ప్రజలు వేరు.

అప్పారావు సామాన్య ప్రజల జీవితసమస్యల నెరింగి, వాటి పరిష్కారమార్గాలు వెతికే ప్రగతిశీలి.

దేవుడూ, ఆధ్యాత్మిక చింతనా, దేశభక్తి, సౌంద ర్యమూ అంటుంటాడు రవీంద్రుడు.

దేశమూ, మానవులూ, విశ్వమానవప్రేమ, సాంఘికన్యాయమూ, ఆర్థికపురోభివృద్ధి అంటాడు అప్పా రావు. వీరి దేశభక్తి గీతాలే వీరి భావాలకూ, తత్త్వధోర ణులకూ ప్రతిబింబాలు.

1. "When one art can fully be explained by another then, it is a failur" —Tagore

# దేశభక్తిగీతం

గురజాడ దేశభక్తి గేయం దేశమాతను పలువిధాల కీర్తించే పాట కాదు; దేవుణ్ణి దేశరక్షణకై స్తుతించే గీత రాజం కాదు; ఇది విశ్వమానవకోటియొక్క జాతీయగీతం. ఇది మానవాభ్యుదయానికి మార్గాలు చూపే భవ్యసూత్రాల రత్నమాల.

అప్పారావు ఈ గేయంలో ప్రగతిశీల వర్ణాల విశ్వ మానవప్రేమకు నివాళు లెత్తాడు. ఉత్తమ సమాజ నిర్మాణానికి, బహుజనుల సుఖశాంతులకు ఇతడు ప్రవచించిన ప్రతి మాట ఉన్నతాశయపు ఉపనిషత్తులని చెప్పాలి. మానవుడు తన ప్రజ్ఞతో పరిష్కరింపలేని అత్యంత క్లిష్ట సమస్యలను కూడా ప్రేమద్వారా సాధింపగలడని ఇతని ప్రగాఢ విశ్వాసం. ఇతని దేశభక్తిలో సంకుచిత ప్రేమకు చోటు లేదు. "మా దేశంలాంటి దేశం ఈ ప్రపంచంలో ఎక్కడా లేదు. మా సంస్కృతి సర్వోత్తమమైంది" అని చెప్పే మితి మీరిన దేశభక్తి వచనాలు ఇతని కలానికి రావు. అన్ని దేశాలూ గొప్పవే. అందరి సంస్కృతీ గొప్పదే! ఒక్కొక్కరిలో ఒకొక్క విశేషముంటుంది. ఎవరి తల్లి వారికి గొప్పదే. తన తల్లియందు భక్తికల్గి ఉండడం ఉత్తమ మానవధర్మమే. కాని నా తల్లిని మించినవారు ఈ ధారుణిలోనే లేరని చెప్పడం అంత బాగులేదు. ఇటువంటి మితిమీరిన దేశభక్తి ధురంధరులైన కవినాయక శిఖామణులు అన్ని దేశాల

లోనూ అక్కడక్కడ కనిపిస్తూ ఉంటారు.[1] ఈ మితిమీరిన దేశభక్తివలన విశ్వమానవలోకమున స్నేహ సహకారాలు దెబ్బతింటాయి. ఒంటెద్దు విధానం ఎక్కువౌతుంది.

"ఆకాశంబుననుండి శంభుని శిరం
బందుండి శీతాద్రి సు
శ్లోకంబైన హిమాద్రినుండి భువి భూ
లోకంబునందుండి యు
స్త్రోకాంభోధిఁ బయోధినుండి పవనాం
ధోలోకముం జేరె గం
గా కూలంకష, పెక్కు భంగులు వివే
కభ్రష్ట సంపాతముల్ !!"

అని భర్తృహరి మహాకవి చెప్పినట్లు విశాల దృష్టిని వీడిన ఈ మితిమీరిన దేశభక్తి స్వదేశాభిమానంతో ప్రారంభమయి రాష్ట్ర ప్రాంత గ్రామాదులకు ప్రాకి చివరకు జాతి కులాలవరకు దిగజారుతుంది.

మానవుని దేశభక్తి విశ్వమానవ భక్తిగా వర్ధిల్లాలి. విశ్వజనీనమైన అనురాగాన్ని పెంపొందించాలి. మానవుడు మానసికంగా అభివృద్ధిగాంచుతూ వస్తున్నాడు. వివేచనాత్మక దృష్టితో, విచక్షణాజ్ఞానంతో అతడు ఉత్తమ

---

"There is no land like England
Where' ver the light of day"— Tennyson.

"లేదురా ఇటువంటి దేశ మింకెందు"— రాయప్రోలు సుబ్బారావు.

సమాజ నిర్మాణానికి కృషిచేయాలి. తన సర్వసౌఖ్యాలకు, తన శాంతియుతజీవితానికి తనకృషే కారణమని ఆత్మశక్తిలో గట్టి విశ్వాసం కల్గి ఉండాలి. విశాలదృష్టితో పవిత్ర విశ్వ మానవ ప్రేమను ఆరాధించాలి. ప్రేమతో, శాస్త్రదృష్టితో మానవుడు సాధించరానిది ఈ ప్రపంచంలో ఏదీ లేదు. ఇదే గురజాడవారి యొక్క ప్రేమ తత్త్వవిలసిత ప్రత్యక్ష వేదాంతం.

"దేశమును ప్రేమించుమన్నా
మంచి అన్నది పెంచుమన్నా,
వొట్టి మాటలు కట్టిపెట్టోయి
గట్టి మేల్ తలపెట్టవోయి!"

"పాడి పంటలు పొంగిపొర్లే
దారిలో నువు పాటుపడవోయి
తిండి కలిగితె కండ కలదోయి
కండ గలవాడేను మనుషోయి."

"ఈసురోమని మనుషులుంటే
దేశ మేగతి బాగుపడునోయి!
జల్దుకొని కళలెల్ల నేర్చుకు
దేశి సరకులు నించవోయి!"

అన్ని దేశాల్ క్రమ్మవలెనోయి;
దేశి సరుకుల నమ్మవలెనోయి;
డబ్బు తేలేనట్టి నరులకు
కీర్తిసంపద లబ్బవోయి!

దేశ ప్రజల సమస్యలపట్ల సానుభూతి కల్గి వాటిని పరిష్కరించడానికై సదా ఆలోచిస్తుండే సహృదయత్వం పెంపొంద చేసుకో. ఇటువంటి ఔచిత్యాన్ని పెంచుకొని మాతృభూమిని ప్రేమించు. వట్టిమాటలు ఆడకుండా త్రికరణ శుద్ధితో గట్టిమేల్ తలపెట్టు. పాడిపంటలతో సుసంపన్నమైన దేశంగా చేసే కార్యక్రమంలో నిమగ్నుడవు కా. తిండి ఉంటేనే కండ పెరుగుతుంది. కండ గలవాడే మనిషని పించుకుంటాడు. ఇటువంటి మనుష్యశక్తి దేశానికి కావాలి. బలహీనులై, ఎముకల గూళ్ళతో ఉసురోమని దేశప్రజ లుంటే దేశమే గతి అభివృద్ధి గాంచుతుంది? తొందరపడి కళలెల్ల నేర్చుకొని స్వదేశ వస్తువులను ఉత్పత్తిచేయి. మీ నాగరికతకు ప్రతిబింబాలైన దేశ పరిశ్రమలలో తయారైన వస్తువులు అన్నిదేశాలలో అమ్ముడుపోవునట్లు చేయి. ఆర్థికంగా బలపడని మనుష్యులకు కీర్తి సంపద లబ్బవు.[1] దేశాభివృద్ధి ఆ దేశపు ఆర్థికాభివృద్ధిపై ఆధారపడి ఉంటుంది.

"వెనుక చూచిన కార్య మేమోయి!
మంచి గతమున కొంచె మేనోయి;
మందగించక ముందు అడుగేయి
వెనుక పడితే వెనకే నోయి"

"పూను స్పర్ధను విద్యలందే
వైరములు వాణిజ్యమందే;

1. "సర్వే గుణాః కాంచన మాశ్రయన్తి"—భర్తృహరిః

వ్యర్థకలహం పెంచబోకోయి
కత్తి వైరం కాల్చవోయి''

''దేశాభిమానం నాకు కద్దని
వట్టి గొప్పలు చెప్పుకోకోయి
పూని యేదైనాను వొక మేల్
కూర్చి జనులకు చూపవోయి.''

వెనుక చూచిన ప్రయోజనం లేదు. మంచి గత మున కొంచెమే. మందగించకుండా ఉత్సాహవంతుడవై పురోగమించు. వెనుకబడ్డావా వెనుకనే ఉంటావు. నిన్నెవ్వరూ చూడరు. నీ స్పర్థ విద్యలలోనే చూపించు. స్పర్థయా వర్థతే విద్యా. వైరము వాణిజ్యాలలోనే చూపించు. అనవసరమైన కలహాన్ని పెంచకు. దానివలన నీ అభివృద్ధి కుంటుపడుతుంది. కత్తివైరము అసలే ఉండకూడదు. దానిని పూర్తిగా కాల్చివేయి. పరస్పర స్నేహసహకారాలలోనే శాంతిసౌఖ్యా లున్నాయి. విరోధంలో సుఖం లేదు.

దేశాభిమానము నాకు కలదని వట్టి గొప్పలు చెప్పవద్దు. గొప్పలవలన ప్రయోజన మేముంది! దీక్షాకంకణధారివై, త్రికరణశుద్ధితో పీడితప్రజానీకానికి ఏదో యొక మేలు చేసి చూపించు. దేశభక్తి అంటే పీడితప్రజానీకంపై భక్తి అన్నమాట. దానిని సార్థకంచేయి.

''ఓర్వలేమి పిశాచి దేశం
మూలుగులు పీల్చేసెనోయి.

ఒరుల మేలుకు సంతసిస్తూ
ఐకమత్యం నేర్వవోయి.

"పరుల కలిమికి పొర్లి యేడ్చే
పాపి కెక్కడ సుఖం కద్దోయి
ఒకరి మేల్ తన మేలనెంచే
నేర్పరికి మేల్ కొల్లలోయి

సొంతలాభము కొంత మానుకు
పొరుగువాడికి తోడు పడవోయి
దేశమంటే మట్టి కాదోయి
దేశమంటే మనుషులోయి."

అసూయాపిశాచి దేశం మూలుగులు పీల్చివేస్తుంది. ఇతరుల మేలుకు సంతసిస్తూ ఐకమత్యంతో బ్రతకటం నేర్చుకో. ఇదే ఉత్తమ మానవలక్షణం. పరుల కల్మికి పొర్లి యేడ్చే పాపాత్మునకు సుఖం లేదు. ఒకరిమేలు తన మేలుగా భావించే నేర్పరికి సర్వసుఖాలు లభిస్తాయి.[1] ఈ హృదయ సంస్కారం మానవుని ఉన్నతదశకు తీసుకు వెళు తుంది. అతని ఐహిక సౌఖ్యానికి ఆలంబన మౌతుంది. శాంతియుత జీవితానికి సాధనమౌతుంది.

సొంతలాభము గురించే మానవుడు సదా చింతిస్తూ ఉంటాడు. అది అతని నైజగుణం. ఈ స్వార్థపరత్వం (వ్యక్తి

1. "అన్యులకును వచ్చు నాపద తనదిగా
ఎన్నువాడు భువిని నున్నవాడు" — వేమన వాణి.

ఆ స్థితినుండే అన్ని చిక్కులూ సంభవిస్తున్నాయి. ధనిక దరిద్రభేదాలు ఏర్పడుతున్నాయి. ఈ భేదాలు ప్రశాంత సమాజ జీవితాన్ని కలుషితం చేస్తున్నాయి. అందుచేత నీవలె నీ పొరుగువాడు సుఖంగా ఉండగోరు. సొంతలాభము పూర్తిగా విడిచి ఇతరులకు సహాయపడడం ఉత్తమోత్తమ మానవధర్మమే[1] అది సాధ్యం కాదు. కాబట్టి కొంతైనా మానుకొని నీ ప్రక్కవానికి సహాయపడు. అందరూ సుఖశాంతులతో ఉండడమే కదా అభ్యుదయ సమాజం.

దేశమంటే కొన్ని ఎల్లలతో గూడిన మట్టిమాత్రం కాదు. ఆ మట్టిపై పుట్టిపెరిగిన అశేష ప్రజానీకం. ప్రజలపై భక్తికల్గి ఉండడమే దేశభక్తి[2].

1. "తమ కార్యంబు పరిత్యజించియుఁ బరార్థప్రాపకుల్ సజ్జనుల్
తమ కార్యంబు ఘటించుచుఁ బరహితార్థప్రాపకుల్
మధ్యముల్" — భర్తృహరి.

2. కీ. శే. పండిత జవహర్‌లాల్ నెహ్రూ 1948 లో మద్రాసు వచ్చినపుడు కార్పొరేషను స్టేడియంలో సిటీ పాఠశాలల విద్యార్థుల నుద్దేశించి ఉపన్యసించారు. విద్యార్థులు అత్యంతోత్సాహంతో "భారతమాతకు జై — పండిత జవహర్‌లాల్‌కు జై" అని నినాదాలు చేశారు. నెహ్రూ వాళ్ళను 'భారతమాత అంటే ఏమిటి?' అని అడిగారు. వాళ్ళు ఒక్కొక్క రొక్కొక్క విధంగా ఏదో చెప్పారు. అపుడు పండిట్‌జీ 'భారతమాత' అంటే అర్థమేమిటో విపులంగా వివరించారు. భారతదేశంలో గల నదీనదాలు, కొండలు, ఎడారులు మొదలైన వాటితో అందు నివసించు విభిన్న జాతులకు, మతాలకు, వృత్తులకు చెందిన అశేషప్రజానీకం అంతా కలిసి 'భారతమాత' అని చెప్పారు. 'భారతమాతకూ జై' అంటే భారత ప్రజలకు జై అన్నమాట అన్నారు. ఈ నిర్వచనం అప్పారావుగారి మట్టిశబ్దంలో ఉన్నది.

"చెట్టపట్టాల్ పట్టుకుని
దేశస్థులంతా నడవవలె నోయి;
అన్నదమ్ములవలెను జాతులు
మతములన్నీ మెలగవలెనోయి!"

"మతం వేరై తేను యేమోయి?
మనసు వొకటై మనుషు లుంటే
జాతి మన్నది లేచి పెరిగి
లోకమున రాణించునోయి!"

"దేశ మనియెడి దొడ్డవృక్షం
ప్రేమలను పూలెత్తవలెనోయి;
నరుల చెమటను తడిసి మూలం
ధనం పంటలు పండవలెనోయి!"

"ఆకు లందున అణగి మణగీ
కవిత కోకిల పలకవలె నోయి;
పలుకులను విని దేశమం దభి
మానములు మొలకెత్తవలె నోయి!"

చెట్టపట్టాల్ పట్టుకొని దేశ ప్రజలంతా నడవాలి. అన్నదమ్ములలాగ మిక్కిలి ఆప్యాయతతో జాతులు మతాలు అన్నీ మెలగాలి. మనస్సులు కలిసి మనుష్యు లున్నపుడు వారి మతాలు వేరై తేనేమి? అవేమి చేస్తాయి?[1] అందరిదీ

1. "పసుల వన్నె వేఱు; పాలేకవర్ణమౌ
పుష్పజాతి వేఱు; పూజ యొకటె
దర్శనములు వేఱు; దైవం బదొక్కటే" —వేమన్న వాణి.

ఒక మతంగా ఎప్పుడూ ఎక్కడా ఉండదు. ఒకప్పుడు ఏ దేశములో ఉన్నా వారిలో కూడా ఏవో అభిప్రాయ భేదాలు ఉంటూ ఉంటాయి. అందుచేత మనుష్యుడు శాంతియుత సహజీవనంలో నమ్మకం కల్గి ఉండాలి. అప్పుడే జాతి అభివృద్ధి చెంది లోకమున రాణిస్తుంది. అంతా పరస్పరం అర్థం చేసుకోవడంలోనే పరస్పర గౌరవం ఆధారపడి ఉంటుంది. ఇదే నిజమైన సంస్కృతి. దేశ మనెడి మహావృక్షం పరస్పర ప్రేమలనే పుష్పాలతో శోభాయమానం కావాలి. ప్రజలు చెమటను తడిసి ధరిత్రి ధనం పంటలు పండాలి.[1] మానవుడు మహనీయుడు. అతడు సాధించరానిది ఈ ప్రపంచంలో ఏదీ లేదు. అతని శ్రమలోనే ఉంది సర్వస్వం.

ఆకులందున అణగి మణగీ కవి కోకిలలు ప్రజా కర్తవ్యాలగురించి ఎప్పటి కప్పుడు మృదుమధుర పంచమ స్వరంతో ఆలపిస్తూ ఉండాలి. వారు ఉదాసీనభావులు కాకూడదు. (మధుమాసంకొరకు ఎదురు చూడ నవసరం లేదు). వారి కావ్య ప్రయోజనము, జీవిత ధ్యేయము సంఘాభ్యుదయమే కదా![2]

1. "భూమిలోన పుట్టు భూసార మెల్లను
తనువులోన పుట్టు తత్త్వమెల్ల
శ్రమములోన పుట్టు సర్వంబు తానౌను"—వేమన్న వాణి.

2. కవి, కోకిల ప్రజలనే ఆకల్లో అణగి మణగీ వారి కర్తవ్యాలు గురించి ఎప్పటికప్పుడూ మృదుమధుర పంచమస్వరంతో ఆలపిస్తూఉండాలి. ఆ యాలాపనలు విని దేశమనే దొడ్డవృక్షంపై(లో) ప్రజాభిమాన మనే మొలక లెత్తాలి; మొగ్గ తొడగాలి. పుష్పభరితమై దేశవృక్షం శోభాయమానం కావాలి.

కవికోకిల మధురస్వనాలను విని ప్రజలలో విశాల దృష్టితో కూడిన దేశభక్తి మొలకెత్తాలి.

ఇదీ గురజాడకవి విశ్వాసం దేశం. శాంతిప్రదమై, ఆనందదాయకమై అభ్యుదయ మార్గాన్ని చూపే సదుప దేశాన్ని ఈ ప్రజాకవి తన దేశభక్తిగేయం ద్వారా చేశాడు.

"కావ్యం యశసేఽర్థకృతే
వ్యవహారవిదే శివేతరక్షతయే
సద్యః పర నిర్వృతయే
కాంతా సమ్మితతయోప దేశయుజే॥"

అన్న కావ్య ప్రకాశకర్త కావ్యప్రయోజనం అప్పారాయ కవీంద్రుని దేశభక్తిగేయంలో చూడగలము.